# గృహలక్ష్మి

15th APRIL 1961





# GRIHALAKSHMI

Vol. No. 30 No. 4

40 nP.








వ్యాయామ క్రీడల్లో పాల్గొనేవారందరికీ అవసరమైన ఉత్సాహ శక్తుల్నిచ్చే ముఖ్యసాధనం అమృత - ఆబాలగోపాలానికీ అద్భుతమైన టానిక్. సేవించడానికి రుచ్యంగావుండి మంచి చురుకుదనాన్ని కల్గిస్తుంది. ఈ అద్భుతమైన పానీయం ప్రసిద్ధమైన మూలికలచేతనూ ఫల రసాలతోను తయారుచేయబడింది. అందరికీ ఆత్మబంధువు లాంటిది.

## కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్, మద్రాసు-14

---

ఆంధ్రప్రదేశ్ కు, తమిళనాడుకు ఏజంట్లు :

**సీతారామ జనరల్ స్టోర్స్, బెజవాడ, సికింద్రాబాదు, మధుర.**

---

# ప్రాధాన్యము
# ప్రాధాన్యము
# ప్రాధాన్యము

ఒకరు చాల జబ్బుగా ప్రమాదస్థితిలో వున్నారు ...
తక్షణం కబురు వెళ్ళాలి
*దానిని "ప్రయారిటీ" టెలిగ్రాము ద్వారా పంపండి*

జబ్బులు, ప్రమాదాలు, మరణాలు మొదలైన వార్తలను పంపడానికి 'ప్రయారిటీ' టెలిగ్రాము సౌకర్యం వున్నది.

ఎక్స్‌ప్రెస్, అర్జంట్ సందేశాలకంటే దీనికి అత్యధిక ప్రాధాన్య మివ్వబడుతుంది, మామూలు ఎక్స్‌ప్రెస్ టెలిగ్రాముకు అయ్యే ఖర్చు మాత్రమే అవుతుంది.

*ఇట్టి టెలిగ్రామును పంపుతున్నప్పుడు "ప్రయారిటీ" అని వ్రాయండి*

## ఈ సౌకర్యంకోసం
## మాతో సహకరించండి

తంతి – తపాలా శాఖ

DA 60/623



కళావిలాసినులు




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

వ్యవస్థాపకులు :
డాక్టరు కే. యన్. కేసరి

ఎడిటర్ :
సి. సి. పున్నయ్య

---

# హిందూకుటుంబపు ఆస్థిపై హక్కులు

హిందూవారసత్వ చట్టాన్ని సవరిస్తూ లోక్‌సభలో ప్రతిపాదించబడిన అనధికార బిల్లు ననుసరించి వితంతువైన తల్లికి, కూతురునకు సమానహక్కులుండగలవు. హిందూవారసత్వం చట్టం అమలులోనికి రాకముందు తండ్రి మరణించడం సంభవిస్తే 14 వ సూత్రం కుమార్తెకు చాల అన్యాయం చేస్తున్నది. అంటే యీ సవరణ ప్రతిపాదన కుటుంబములోని ప్రతివారికి న్యాయం జరగాలనే ప్రాతిపదికను మరింత పదిలం చేస్తున్నది.

ఒక కుటుంబయజమాని మరణించాడనగానే కుటుంబములోనివారెవ్వరు తమ కంతవరకున్న అవకాశాలకు, హక్కులకు భంగము కలుగుతుందని భయపడుట కవకాశ ముండకూడదు. ఉన్న ఆస్థిపాస్తులలో వితంతువైన తల్లి, కుమార్తెలు సమాన వాటాలకు అవకాశమున్నప్పుడు వారి భవిష్యత్తును గురించి ఆందోళన పడవలసిన అవసరం

నయితం యుండదు. తల్లిని పోషించడం భారంగా బిడ్డలుకాని, తమ భవిష్యత్తు జీవనమునకుగాను బిడ్డల దయాదాక్షిణ్యములమీద నాధారపడవలసిన దేయని వితంతువైన తల్లిగాని ఆందోళనపడవలసియుండదు.

ఇది యిలాగుండగా కుటుంబపు ఆస్తిపాస్తులు వృద్ధియగుట అనునది కుటుంబములోని ప్రతియొక్కరు ఆసక్తి కలిగి, బాధ్యతాయుతులుగా నున్న నే సాధ్యము. అంతే కాకుండా కుటుంబములో క్రమశిక్షణ, న్యాయాన్యాయముల దృష్ట్యా పరస్పర సానుభూతి సద్భావములు, పిన్నలకు పెద్దలయెడల విశ్వాసము, పెద్దలకు పిన్నలపట్ల ప్రేమానురాగములు అత్యవసరము. ఇవియున్నచో కుటుంబసౌభాగ్యము పెంపొందుటయేకాక అందలి ప్రతియొక్కరు చీకు, చింతలేని జీవితం గడుపకలుగుతారు. ఎవరికీ అన్యాయము జరుగనేరదు. అట్టి కుటుంబము దేశానికి, ప్రపంచానికి కూడ మేలు చేయకలిగి అభివృద్ధి అభ్యుదయాలను ప్రోత్సహించకలుగుతుంది.

ముఖ్యంగా కుటుంబములోనివారు బాధ్యతారహితులైతే మాత్రం కుటుంబం వృద్ధి కుంటుబడుతుంది. చివరకు కుటుంబం పెద్ద చనిపోగానే స్పర్థలతోటి, ద్వేషంతోటి చినిగిన విస్తరాకువలె కాగలదు. కుటుంబపు సౌభాగ్యమును ప్రోత్సహిస్తూ, ఆ సౌభాగ్యాన్ని కుటుంబములోని ప్రతియొక్కరు స్వీయపురోభివృద్ధిని రూపొందించుకొనుటకు తోటివారికి అన్యాయము తలపెట్టకుండా వినియోగించుకుంటే అది విజ్ఞత కాగలదు.

హిందూవారసత్వ చట్టాన్ని సవరించడం వితంతువైన తల్లికి, కుమార్తెలకు కూడ సమాన ఆస్తిహక్కును సమకూర్చి న్యాయం కలుగజేయ నుద్దేశించిన దగుటచే సమర్థించతగినది.

---

# అభ్యుదయ నిరోధకశక్తులు

ప్రతియొక్కరు అభ్యుదయాన్ని, అభివృద్ధిని కాంక్షిస్తున్నట్లు కనుపిస్తారేకాని వారి ఆశయలక్ష్యాలు మాత్రం ఎక్కడికక్కడ వానిని ప్రోత్సహించుటలేదు. ప్రజల్లో పరస్పరవిశ్వాసం క్రమంగా సన్నగిలుతున్నదంటే వారిలో చిత్తశుద్ధిలోపం ముమ్మాటికీ కారణమనాలి. ఎటుచూచినా స్పర్థలు, విద్వేషాలు ప్రబలుతున్నవంటే ప్రజలలో వ్యక్తిగతంగా ఉమ్మడిశ్రేయస్సుపట్ల, ఆసక్తి, పరస్పర సానుభూతి, సద్భావాలు లోపిస్తున్నవని చెప్పాలి. కాబట్టే ప్రధాని నెహ్రూ విద్వేషాలు పురికొల్పే శక్తుల నిర్మూలనం జరిగి తీరాలంటూ, అది జరుగని పక్షంలో నాశనం తప్పదని హెచ్చరించారు.

సమాజవికాసం, తద్వారా లోకకళ్యాణం రూపొందాలంటే స్వార్థానికి పరిమితులంటూ ఏర్పడాలి. అది జరుగడానికి త్యాగసేవాసక్తి పెంపొందాలి. ఇటువంటివన్నీ ఒకదాని ననుసరించి మరొకటి విశాలహృదయము, దృక్పథముతో సమకూరవలసినవి.

లోపాలను సరిదిద్దుకోడానికి రాజకీయ, సాంఘిక రంగాలలో విమర్శ అవసరం. ఆ విమర్శ సదుద్దేశంతోటి, నిర్మాణయుక్తమైనదైనచో అది జాతీయశ్రేయస్సుకు వినియోగపడుతుంది. అందుకు భిన్నమైన విమర్శలు జాతీయశ్రేయస్సుకు తోడ్పడవు సరికదా పరిస్థితుల స్థాయిని మరింత దిగజారగొట్టగలవు.

ఇంచుమించుగా ప్రతియొక్కరు కులతత్వాలు నశించాలని ఎలుగెత్తి చాటుతుంటారు. ఈనాడు కులతత్వాల తీవ్రత బాగా తగ్గింది. విద్యావిజ్ఞానముల వ్యాప్తితో, కులమత భేధాలకు అతీతంగా సమాన అవకాశాలు, హక్కులు మన రాజ్యాంగంలో అమరిన తరువాత ఎన్నికలలో కులాల ప్రాతిపదికమీద దేశంలో పార్టీలుండటం క్షేమకరం కానేరదు. కులపక్షాలు ఏర్పడ్డది, ఏర్పడబోవునది వ్యక్తిగతంగా ఆయా కులాల శ్రేయస్సుకి కృషిచేయడానికి. అంతటితో మాత్రం ఆగదు - కులాల మధ్య పరస్పర ద్వేషం, అసూయ, స్పర్థలను ప్రోత్సహించడానికి యీ పార్టీలు బాగా వినియోగపడగలవని గతచరిత్ర నాధారంచేసికొని తెలిసికొనవచ్చును. ఈ పరిస్థితులలో రాబోయే ఎన్నికలలో కులపక్షాలపై నిషేధం విధించాలన్న ప్రతిపాదనను కాంగ్రెస్ పార్లమెంటరీ బోర్డులోని అధిక సంఖ్యాక సభ్యులు వ్యతిరేకించడం అభివృద్ధి అభ్యుదయాలను ప్రోత్సహించడంకాదు.

ఏనాడో తమకు అగ్రకులాలవారివలన అపకారం, అన్యాయం జరిగిందంటూ యీనాడు వారిమీద దెబ్బతీయాలని యితర కులాలవారు అవకాశాలకు వెదకులాడటమో, అసభ్యమైన విమర్శలతో, ప్రవర్తనతో కులతత్వాలను రెచ్చగొట్టడమో విజ్ఞత కాదు. ఎవరివల్లనైతే తమ కపకారం జరిగిందంటున్నారో వారే తమ యీనాటి అభివృద్ధి అభ్యుదయాలకు కారకులైనారని పారజూచినచో తెలియగలదు. హరిజనోద్యమం కాని, అస్పృశ్యతా నిర్మూలనకాని, వర్ణాంతర, మతాంతర వివాహాలు కాని, వితంతు వివాహాలలాంటి సంస్కరణలనుకాని సంఘంలో ప్రవేశపెట్టి, కృషిచేసి, సేవాత్యాగాలతో ఘనవిజయాలను సాధించింది తాము ద్వేషిస్తున్న అగ్రకులాలవారే నన్నది మరువరానిది. అంటే కుల, మత భేధాల రూపుమాపుటకు పూనుకున్నదికాని, చిత్తశుద్ధితో కృషి సల్పుతున్నదికాని యీనాడు అగ్రకులంవారని పిలువబడేవారే కాని యితరులుకారు. గంభీరోపన్యాసా లివ్వవచ్చుకాని బ్రాహ్మణేతరులలో ముఖ్యంగా తమకు అగ్రకులాలవారివల్ల అన్యాయం జరిగిందనుకునేవారు కులతత్వాల నంటిపెట్టుకొని కులద్వేషాలను రెచ్చగొడుతున్నారు.

ఈనాడు రాజకీయరంగంలోని అధికార, ఆధిపత్యాలకు ప్రాకులాడుతున్న వర్గాలను చూస్తే వారి స్వార్థము, అఘాయిత్యము నీతినిజాయితీల కతీతంగా పన్నుతున్న పన్నాగాలు చూస్తే వీరు ఆనాటి అగ్రకులాలవారికంటె ఏమీ తీసిపోరు.

ఈ పరిస్థితులలో దేశాన్ని, ప్రజలను సంక్షోభంనుండి రక్షింపగలిగినది సమరస సమైక్యతలు, ఉమ్మడిశ్రేయస్సు నుద్దేశించిన కృషి, విశాలదృక్పథం. వానిని విస్మరించి వ్యవహరించుట అభ్యుదయ నిరోధకము కాగలదు.

# శ్రీరామకృష్ణ పరమహంస జీవితవిశేషాలు

శ్రీమతి యం. వేదవల్లి తాయారమ్మ



ప్రపంచానికెప్పుడైనా నూతనసందేశం నూతన విధానం కల్పించవలసిన కాలంలో భగవంతుడు మానవరూపంలో తానవతరించిగాని తనకత్యంతప్రియ భక్తుల నీలోకంలో పుట్టించిగాని, లోకోద్ధరణచేస్తూ ఉంటాడు. శ్రీకృష్ణభగవానులు, బుద్ధుడు, జొరాష్టర్ లో-టాజ్, క్రీస్తు, మహమ్మద్, శంకరాచార్యులు, నింబార్క, వల్లభాచార్య, శ్రీచైతన్య మహాప్రభువు, గురునానక్ మొదలైన మహాపురుషు లవతరించి వారి సందేశాలద్వారా విశ్వమానవకల్యాణం కలిగించారు.

అటువంటి వ్యక్తులు నిశ్శబ్దంగా నిగూఢంగా ప్రపంచంలోకి వచ్చి మెఱుపుతీగెలవలె మాయమవుతారు. వారిని చాలా కొద్దిమంది మాత్రమే చూస్తారు. వారిని గ్రహించుకొనేవారు అంతకంటె తక్కువగావుంటారు. అనుకరించేవారు మరీ తక్కువ. తత్త్వదర్శనం యెందరికి లభిస్తుంది?

అట్టే రామకృష్ణపరమహంసగారి జన్మకూడా చాలా విచిత్రమైనది. ఆయన జీవిత చరిత్ర ఆచరణరూపమైన ఆస్తిక్యానికి సజీవాకృతి. జితేంద్రియత్వానికి దృష్టాంతాలంకారం. సగుణోపాసనకు ప్రతికృతి, ఆధ్యాత్మిక దివ్యజీవనానికి మేలుబంతి. పారమార్థిక సత్యాన్ని తెలిసికోలేక అజ్ఞానాంధకారంలో కొట్టుమిట్టాడే జన బాహుళ్యానికి; సజీవమై దేదీప్యమానంగా ప్రకాశించే ఆధ్యాత్మికతేజోదర్శనం చేయించి మనశ్శాంతి నీయగల నిశ్చలభగవద్విశ్వాసానికి రామకృష్ణుని దివ్యజీవితము అద్భుతదృష్టాంతం. వీరి జీవితాన్ని పూర్తిగా అనుకరిస్తే దుర్లభమైన భగవత్సాక్షాత్కార భాగ్యంకూడా కలుగుతుంది.

ఈ మహాపురుషుడు పశ్చిమబెంగాల్ హుగ్లీ జిల్లాలో "కామార్పుకుర్" అనే గ్రామంలో క్రీ.శ. 1836 వ సం॥ ఫిబ్రవరి 18 వ, తేదీని జన్మించినాడు. గీతగోవిందకర్త జయదేవుడు, విద్యాపతి చాందిదాస్, శ్రీచైతన్య మహాప్రభువు, శ్రీరామప్రసాద్, కమలాకాంతుడు మొదలైన మహాపురుషులంతా వంగరాష్ట్రపుణ్యభూముల్లో అవతరించినవారే. ఈయన తండ్రి క్షుదిరామ్ ఛటర్జీ, సదాచార సంపన్నుడైన బ్రాహ్మణోత్తముడు. దయార్ద్రహృదయుడు. నిశ్చలమైన శ్రీరామ భక్తిపరుడు. తల్లి చంద్రమణీదేవి. "శాంతికి ల్యానికి సత్యప్రియత్వానికి మూర్తీభావమే మాతల్లి" అని శ్రీగురుదేవుడు చెప్పేవారట. అటువంటి పవిత్ర దంపతుల ప్రేమఫలంగా అవతరించారు మన పరమహంసగారు. తండ్రి గయలో కొంతకాలముండి; అక్కడ గదాధరుడని పిలువబడే శ్రీ మహావిష్ణువును పూజించిన కాలంలో గలిగిన యీబిడ్డకా దేవుని పేరు "గదాధరుడు" అని నామకరణం చేశారు. తరువాత ఆయన ఆధ్యాత్మిక జీవితంలో కలిగిన మార్పులతోబాటు పేరుకూడా "రామకృష్ణుడ"ని మారింది. భగవత్సాక్షాత్కారంలో పరమహంసలు పొందే స్థితిని పొందినందున "పరమహంస"గారనే పేరు రూఢమైనది.

రామకృష్ణునికి బాల్యంనుండీ లోకాతీతమైన మానసిక స్వభావలక్షణాలుండేవి. తనతోడి బాలకులతో ఆటలాడుకోకుండా జనసంచారంలేని తావులకు వెళ్ళి ఒంటరిగా ప్రకృతి దృశ్యాలు చూస్తూ ఆనందం అనుభవించేవాడు. సాధుసమాజం యెక్కడైనా కనబడితే వాళ్ళ వెన్నంటి ఆధ్యాత్మిక ప్రసంగాలు వింటూ వారు పాడే పాటలు పాడుకుంటూ తన్మయత పొందేవాడు. ఎవరైనా స్త్రీలు దేవీ కీర్తనలు పాడితే అవి విన్నంతమాత్రాన హృదయం దివ్యభావోద్రేక పరవశం కాగా; బాహ్యస్మృతి లేకుండావుండేవాడు, ఆ స్థితిలో భగవన్నామం చెవిని బడితేగాని తెలివి వచ్చేది కాదు.

"మద్గుణశ్రుతి మాత్రేణ । మయి సర్వగుహాశయే ।
మనోగతిరవిచ్ఛిన్నా । యథాగంగాంభసోఽంబుధౌ"

అని శ్రీమద్భాగవతంలో కపిలాచార్యులవారు సెలవిచ్చిన అవిచ్ఛిన్నమైన మనోగతి గొప్ప పూర్వజన్మసంస్కారంగల మన రామకృష్ణునికి కలిగి మనస్సు సమాధిలోకి వెళ్ళిపోయేది. ఈయన పెద్దచదువులేమీ చదువలేదు. పల్లెటూరి పాఠశాలలో చదివిన కొద్ది చదువు సత్సాంగత్యం వీటివల్లనే ప్రపంచాతీతమైన ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని సంపాదించి ఆత్మసాక్షాత్కారాన్ని పొందినారు. సర్వభూతసమత్వం, సర్వమానవప్రేమ ఆయన సహజగుణాలు. సర్వమత

సహనం ఆయనలో గల విశేషం. ఈ పరిస్థితుల్లో నుండగా "రాణీ రాస్మణీదేవి" అనే జమీందారిణి కలకత్తాకు నాలుగుమైళ్ళ దూరంలో నున్న "దక్షిణేశ్వరం"లో జగన్మాత ఆజ్ఞవల్ల కాళికాదేవికి గొప్ప దేవాలయం కట్టించింది. ఆదేవికి పూజారిగానుండి ఆదేవీ సాన్నిధ్యంలోనే అన్ని సిద్ధులు పొందినారు. కొంతకాలమైన తరువాత జగన్మాత పంపించిన వీరి గురువు "భైరవీబ్రాహ్మణి" అనే బ్రహ్మచారిణిద్వారా తాంత్రిక సాధనలన్నీ సాధించి జగజ్జనని దయకు పాత్రులైనారు. "తోతాపురి" అనే మాయావాద సన్యాసివద్ద అద్వైత సిద్ధాంతాన్ని సమగ్రంగా తెలిసికొన్నారు. కాని జగదీశ్వరీ ఉపాసన మానలేదు. 64 తాంత్రిక సాధనలలో సిద్ధి పొందిన మహనీయుడు. షోడశీ పూజలో విజయం సాధించిన జితేంద్రియుడు.

ఈయన జీవితంలో వివాహం ఒక ఆశ్చర్యకరమైన ఘట్టం. దైవనిర్ణయప్రకారం శారదామణీదేవిని వివాహం చేసుకున్నారు. కాని గార్హస్థ్య జీవితంలో కనీ వినీ యెరుగని బ్రహ్మచర్యవ్రతం పాలించిన కఠోర తపస్వి. భార్యను జగన్మాత ప్రతికృతిగా భావించి ఆమెకుకూడా తనయందు భర్తృ భావం లేకుండా గురుభావం కల్పించిన గురుదేవుడు. ఏ స్త్రీని చూచినా ఆయనకు మాతృభావమే. తానుగూడా స్త్రీ ధర్మాన్నవలంబించి చీర కట్టుకొని కాళీమాతనుపాసించిన ఉపాసకుడు. భార్యనుపాస్యదేవతగా కూర్చుండబెట్టి షోడశీ పూజచేసి దానిలో జయం పొందడమే ఆయన దృఢజితేంద్రియత్వానికి తార్కాణము. కామకాంచన విజయంలో వీరు పొందిన సిద్ధి నిరుపమానం.

ఈయన మహిమ వంగదేశమంతటా వ్యాపించింది. వేనవేలు ప్రజలు వచ్చి మూగిపోయేవారు. ఎటువంటి నాస్తికులు వచ్చి విషమ ప్రశ్నలు వేసినా వారికి తగిన సమాధానాలీయగానే దాసోహమని శిష్యులయ్యేవారు. ఆయన దర్శనమాత్రం చేతనే యెందరికో దివ్యానుభూతులు కలిగేవని శిష్యులు వ్రాశారు. వారిలో వివేకానంద, బ్రహ్మానంద, అభేదానంద, శారదానంద, శివానంద, తురీయానందులనువారు ముఖ్యులు. అందరిలోను గురుదేవుని పరిపూర్ణకటాక్షం సంపాదించినవాడు స్వామి వివేకానందం. వివేకానందుడు గురుదేవుని దర్శనం చేయగానే, ఆయన ఒక్క చూపులోనే ఇంకామాట్లాడకుండానే వివేకానందునకు వివేకం కలిగి జీవితమంతా పూర్తిగా మారిపోయింది. అతి శీఘ్రకాలంలో ఆత్మ సాక్షాత్కారం చేయించగలిగిన సద్గురుమూర్తి తనకు దొరికినందు కుప్పొంగిపోయాడు. గురుదేవుని ఆజ్ఞప్రకారం వారి దివ్య సందేశాన్ని ఖండఖండాంతరాల్లో వ్యాపింపజేసి, గురుదేవునికి శాశ్వత కీర్తిని సంపాదించిపెట్టిన శిష్యవరేణ్యుడు. ఇది కలియుగం. పైగా యంత్రయుగం. మానవశక్తి మీదనే పూర్తి నమ్మికగల 19 వ శతాబ్దం. ఇటువంటి కాలంలోకూడా ఆధ్యాత్మిక సాధనలవల్ల భగవత్సాక్షాత్కారం సులభంగా పొందవచ్చుననే పారమార్థిక సత్యాన్ని ముముక్షుజనానికి తెలిపి ఆచరించి చూపిన కర్మయోగి అవడంచేత గురుదేవునికి వేనవేలు ప్రజలు పాశ్చాత్య దేశీయులుకూడా శిష్యులైనారు. ఆయన తన శిష్యుల కెన్నడు ఏ విషయంలోను శాసించలేదు. "ఉద్ధరేదాత్మనాత్మానం" అను భగవద్వాక్య ప్రకారం ఎవరికి వారే ఉద్ధరించుకోవాలని బోధించేవారు. వారాచరించని విషయం ఒక్కటి చెప్పలేదు. అందువల్ల శిష్యులు వారు మాట్లాడిన ప్రతిమాట సూక్తిగా గ్రహించేవారు.

వీరు తాంత్రికయోగసాధనలే కాకుండా భక్తియోగసాధనలైన శాంతభావము, దాస్యభావము, సఖ్యభావము, వాత్సల్యభావము, మధురభావములను పంచభావములనుకూడా సాధించి భక్తియోగసిద్ధిని కూడా పొందిన భాగవతోత్తముడు. ఆధ్యాత్మిక క్షేత్రంలో వారు సాధించని భాగం లేదంటే అతిశయోక్తి కాదు.

"సచ్చిదానంద స్వరూపుడైన పరబ్రహ్మస్వరూపము విశ్వమంతటా నిండి నిబిడీకృతమైయున్నది. "హరిమయముగాని ద్రవ్యము పరమాణువు లేదు" సకలజీవరాశుల హృదయాంతర్వర్తియైన పరమాత్మ స్వరూపము అనేక రీతుల్లో భాసిస్తుంది. వీన్ని తెలిసికొనడమే భగవంతుని తెలిసికొనడం. కర్మయోగ భక్తియోగ జ్ఞానయోగ అష్టాంగయోగాదులైన సాధనలన్నీ ఆ స్వరూపాన్ని తెలిసికోడాని కేర్పడినవే. లోకసంబంధమైన కోరికలను త్రుంచివేసి హృదయ పారిశుద్ధ్యం చేసికొని భగవంతుని కాత్మార్పణంచేసి తాను నిమిత్తమాత్రుడనని దృఢనమ్మికతో భగవద్ధ్యానపరుడైతే; భగవంతుడే స్వయంగా ఆ వ్యక్తిని గమ్యస్థానానికి చేర్చగల"డని వారి బోధనలలోని సారాంశము.

ప్రతి మానవునికి ఆధ్యాత్మిక శక్తి ఒకటి లోపల అణగియుంటుంది. దానికి దోహదమిచ్చి వృద్ధి

చేశారు. అట్లుచేసినవాడు భగవదనుభవం దానంతటదే కలుగుతుంది. ఈ ప్రక్రియ వారి జీవితవిధానంలో వివిధ రంగాల్లో స్పష్టమవుతుంది. ఆయనకు ఆదిలోనే నిర్వికల్ప సమాధి కలిగేది. దానినే అపారంగా వృద్ధిచేశారు. వీరికి దేవతాంతరద్వేషం గాని మతాంతరద్వేషంగాని లేదు. పరబ్రహ్మ శక్తి అయిన కాళీమాత ఉపాసనా మహిమవల్లనే దేవతలంతా స్వాధీనమైనారు.

“బ్రహ్మ సత్యం జగన్మిథ్య” అనే అద్వైతసిద్ధాంతాన్ని అవగాహన చేసుకున్నవాడైనప్పటికి జగత్తు యొక్క అనిత్యత్వాన్ని మాత్రమే అంగీకరించారు గాని మిథ్యాత్వాన్నంగీకరించలేదు. బ్రహ్మపదార్థ మొక్కటే వివిధ రూపాలతో భాసిస్తుంది. పరబ్రహ్మమునకు ప్రకృతికి గల సంబంధము సూర్యునికి సూర్యకిరణాలకు గల సంబంధము వంటిది. అది విడదీయ వీలుగానిది. పరబ్రహ్మ శక్తియే ప్రకృతి. ప్రకృతి స్వరూపిణి కాళీమాత. ఆమె ఉపాసనవల్ల మాయావరణను దాటి బ్రహ్మ సాక్షాత్కారాన్ని పొందిన మహానుభావుడు గురుదేవుడు. లోకసంగ్రహార్థం పాటుపడడమే భగవత్ప్రీతి అని, భగవత్ప్రీతివల్ల భగవదనుభవం కలుగుతుందని తమ శిష్యులచేత చేయించి చూపించి నిరూపించిన మహిమాన్వితుడు. ఇటువంటివారి జన్మవల్ల భారతభూమి ధన్యమైంది.

“తన అసమాన సాధనలవల్ల దివ్యశక్తులను పొంది ప్రకృతిని జయించి కోలాది ప్రజల మన్ననలంది ఆధ్యాత్మిక సామ్రాజ్యానికి పట్టాభిషిక్తుడైన వానిని మన కండ్ల యెదుట చూచి వారిని సేవించి వారి ఉపదేశామృతాన్ని అనుభవించిన మనం ధన్యులం” అన్నారు స్వామి అభేదానంద.

—[ఆకాశవాణి విజయవాడ కేంద్రము వారి అనుమతితో]

—(o)—

వింతలు - విశేషాలు:

# అన్నపూర్ణ

ప్రపంచంలో నూరింట అరవయి మందికి, రెండు పూటలా సంతుష్టికరమైన భోజనం లభించడంలేదు. మన దేశంలో యిట్టివారిసంఖ్య యింకా ఎక్కువగానే వుంది. ఆకలి, దారిద్ర్యం మానవజాతిని పీడిస్తున్న మహాసమస్యలలో ముఖ్యమైనవి. అందుకనే అంతర్జాతీయ ఆహార వ్యవసాయ సంస్థవారు ప్రపంచంలో ఆకలి నిర్మూలించడానికి ఒక ఉద్యమం స్థాపించారు.

కడుపు నిండినవాడికి గల స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు క్షుద్బాధాపీడితునికి ఉండవు. అందుకనే మానవ చరిత్రలో, ఆహారసంపాదన, ఆహార స్వయంసమృద్ధి అనాదిగా అత్యధిక ప్రాధాన్యం వహిస్తూనే వచ్చాయి. అందులోనూ ఆహారధాన్యాలని వండుకోవడం ఒక కళగా రూపొందిన తర్వాత దేశదేశాలలోనూ ఆహారపదార్థాల సద్వినియోగానికి నూతనోద్యమాలు అరంభమయాయి.

వంట, పాశ్చాత్యదేశాలలో ఒక కళగా ఎలా రూపొందిందీ, వ్యవసాయం, వ్యవసాయపు పద్ధతులూ, కొత్తరకాల విత్తనాలు తయారుచేయడం, ఆహారధాన్యాలు బాగుచేసే పద్ధతులు, రొట్టెలు తయారుచేసే విధానాలూ, శతాబ్దాలనుంచీ ఎలా జరిగినదీ, ప్రస్తుతం ఎలా జరుగుతున్నదీ నిరూపించే చిత్రమైన ప్రదర్శనం ఒకటి పశ్చిమ జర్మనీలో లోగడ ఏర్పాటు చేశారు.

జర్మనీ సందర్శించినవారిలో డాన్యూబ్ నదీ తీరంలో వున్న “అలమ్” అనే సుందర నగరం చూడనివారుండరు. ఆ నగరంలోని చరిత్రాత్మక భవనాలలో అక్కడి క్రైస్తవ మఠాలయం చాలా అందమైన భవనం. ప్రపంచలో దాని గోపురం అంత ఎత్తైన గోపురం ఎక్కడాలేదు. ఆ నగరంలో యీ మధ్యనే కొత్తగా యీ ఆహార పదార్థాల ప్రదర్శనశాల ఏర్పాటు చేశారు.

ఈ ప్రదర్శనంలో ఎన్నో చిత్రమైన విషయాలు వున్నాయి. పంటలు, వంటలు, వాటి వివరాలు మాత్రమే కాక మానవచరిత్రలో గడచిన నాలుగువేల సంవత్సరాలలోనూ, అనేక దేశాలలో ఆహార పదార్థాలకి సంబంధించిన మతగాథలు, సాంప్ర

(152వ పేజీ చూడుడు)

# పోలియోవ్యాధి-నివారణ

డా॥ ప్రకాశచంద్ర శతపథి
కార్యదర్శి :
ఆంధ్రప్రదేశ్ ఆయుర్వేదమహామండలి

పోలియో అని నేడు బహుళప్రచారము గావింపబడుతున్న వ్యాధి వాతవ్యాధులలో నొకటి. సాధారణముగా దీనిని శిశుపక్షవాతమని వ్యవహరించుదురు. పక్షవాతం సోకినవెంటనే కలుగు లక్షణము లెట్టివిగా నుండునో - పక్షవాతములో యెటుల కాళ్ళు, చేతులు, ముఖము లేక మరేదేని అంగము చచ్చుబడిపోయి అశక్తముగా మారునో అట్టి లక్షణములు పోలియో వ్యాధిలోనూ యేర్పడ్డం జరుగును గనుక దీనికి శిశుపక్షవాతమని వ్యవహరించడం జరుగుచున్నది.

ఆయుర్వేదశాస్త్రమున యితర దోషములతో బాటు వాతదోషం వలన ఏర్పడే వ్యాధులు ఎన్నో వున్నా - వాతం ప్రధానంగా ధూషితమయిన వ్యాధులు ఎనుబది గలవు. అందు బిడ్డల పాలిట ప్రమాదకరమయినది "ఆక్షేపక వాతము." ఈ వ్యాధికి సాంక్రామికత కూడా గలదు. ఒకరికి యీ వ్యాధి వచ్చిన యితరత్రా ఆ ప్రాంతములోని బిడ్డలకుకూడా యిది సోకును. సాధారణంగా యీ వ్యాధి జ్వరముతో ప్రారంభమగును. ఈ జ్వరం ఒక సమయమున తీవ్రస్థితికి వచ్చును. అప్పుడు కాళ్లు చేతులు ముఖము, తల వణకు ప్రారంభమగును. చూపులో వక్రత యేర్పడును. మెడ వేలాడదీయడం జరుగుతుంది. కొందరిలో మాట కూడా లేకుండా పోతుంది. కాళ్లు. చేతులు, ముఖము-ఉబ్బరిస్తుంది. ఈ వ్యాధి ప్రమాదభరితమే అయినా నేడు ప్రచారము జరుగుచున్నంతగా భయోత్పాతము చెంద బని లేదు. లేనిపోని కంగారు పడవలదని ప్రజలను గోరుచున్నాను. ఈ వ్యాధిని గూర్చి అతి ప్రచారము భయోత్పాతము వలన సామాన్య జ్వరములలో కూడా అగుపించు ఒకటి రెండు లక్షణములు పోలియో వ్యాధి లక్షణములతో తుల్యమైనవి కనబడగానే- అసలు వ్యాధికి చికిత్స చేయవలసినదిపోయి, కంగారు పడి, పోలియో వ్యాధికి చేయు చికిత్స జరపడం - ప్రమాదం కొని తెచ్చుకొనడమే అవుతున్నది. గనుక ప్రజలు లేనిపోని భయం పెట్టుకొనరాదని గోరుచున్నాను.

## వ్యాధి నిరోధం :

శొంఠి ఒక తులం, వావిలి ఆకు ఒక తులం (సంస్కృత నామం "నిర్గుండి"), గానుగ చెక్క ఒక తులం (సంస్కృతనామం "కరంజ") వీటిని చక్కగా దంచి, వీటన్నింటి మొత్తమునకు పదునారురెట్లు జలములో (48 తులములు) వేసి కాచి, ఎనిమిదవ భాగమునకు (6 తులములు) కషాయం

దించి, ఆ కషాయం బిడ్డలకు 1/8 ఔన్సు నుండి 1/2 ఔన్సు వరకు రోజుకు రెండు మూడు తడవలు యిచ్చిన యీ వ్యాధి సోకదు. వ్యాధి సోకిన పిదపకూడా యీ కషాయం యియ్యడం వలన వ్యాధి తీవ్రత తగ్గించును.

**చికిత్స:**

ఆయుర్వేదౌషధములలో "వాతగజాంకుశం" "శీతాంశురసం"-"తామ్రభస్మం" యీ మూటిని గలిపి తగు ప్రమాణంగా రోజుకు నాల్గు తడవలు పై కషాయంతో గాని, లేక తేనెతోగాని యిచ్చిన వ్యాధిని తప్పక నయము చేయును.

దృష్టి మందగించినా-స్మారకం లేకున్నా, మగతగానున్నా-"శీతాంశురసం" పొడిని ముక్కురంధ్రములలో ఒక గ్రైను వంతున ఊదిన (నస్యకర్మ) మగత విడిపోవును. కాళ్లు చేతులు వణకుచున్నా- చచ్చుబడినట్లున్నా-"క్షీరబలా తైలం" మర్దన చేయవలయును. ఈ తైలమునే రోజుకు రెండు సారులు పాలలో 5,6 బొట్లు కలిపి త్రాగించడం కూడా మంచిది. ఈ చికిత్సా విధానం అనుసరించుట వలన 'ఆక్షేపక వాతము' లేక పోలియో అను వ్యాధి నయమౌతుంది.

ఈ చికిత్సను అనుసరించవలసినదిగా సర్వులను గోరుచున్నాను.

---

(150 వ-పేజి తరువాయి)

దాయక విజ్ఞానం, ఆర్థిక సాంఘిక సమస్యలు మొదలయిన వెన్నో నిరూపించే చిత్రాలు, పటాలు, ఫోటోలు, దీనిలో ప్రదర్శించారు. వ్యవసాయదార్లు వివిధదేశాలలో వాడిన, వాడుతున్న పరికరాలు, పనిముట్లు, నాటినుంచి నేటివరకూ రొట్టెలు చేసుకునే పద్ధతులు, మొదలయినవెన్నో యీ ప్రదర్శనంలో చూడవచ్చు. అయిదువేల ఏళ్ళక్రితం, మెసపొటోమియాలో మానవుడు మొదటిసారిగా ఆహార ధాన్యాలు పండించాడని ఋజువుచేసే చిత్రపు నకలు, శతాబ్దాలుగా రొట్టెలుచేసే రకరకాల పొయిలు, రొట్టెలుకాల్చే పద్ధతులు, నిరూపించే చిత్రాలు ఉన్నాయి. ఇవన్నీగాక వేరువేరు దేశాలలో సంభవించిన క్షామాలు, అతివృష్టి, అనావృష్టి విషయాలు, వాటివల్ల ప్రజల భోజన పద్ధతులలో కలిగిన మార్పులు దీనిలో చూడవచ్చు. ఈ ప్రదర్శనాలన్నీ జర్మనీలో "రొట్టెల ప్రదర్శనం" అని పిలుస్తారు.

సాంకేతిక, విజ్ఞాన రంగంలో, మానవుడు నేడు సాధిస్తున్న శీఘ్రప్రగతిఫలితంగా, మానవుని ప్రధాన అవసరాలలో ఒకటైన దైనందిన ఆహారం ఎడ, అతని గౌరవప్రపత్తులు క్షీణించకుండా ఉండాలనే ఉద్దేశంతో "ఉలమ్" నగర పురపాలకసంఘ సభ్యులొకరు యీ శాశ్వత ప్రదర్శనాన్ని ఏర్పాటుచేశారు.

"భిక్షాం దేహీ కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ."

—"ఇంటా"



ముఖచిత్రం:

## కుమారి యస్. కల్యాణి

ఈ బాలనర్తకి శ్రీ వి. శ్రీరాములుగారి కుమార్తె. శ్రీమతి లలిత సరస్వతి (ట్రిప్లికేన్ - గాననిలయం) సుశిక్షణలో భరతనాట్యము నభ్యసించి యీ మధ్యనే మద్రాసులో నారదగాన సభవారి అధ్వర్యమున అరంగేట్రం జరిపి ప్రముఖుల అభినందనాశీస్సులకు పాత్రురాలైంది.

# ఐతరేయోపనిషత్తు

## పూజ్యపాద స్వామీ చిన్మయానందులవారి వ్యాఖ్యానములు

అనువాదము : Dr. W. రాధాకృష్ణయ్య



ఆదేవిధముగ పూర్వకాలమున, మహాఋషులు తమ శిష్యులకు వేదాంతము బోధించుచుండిరి. జనులు వయోతారతమ్యములు గమనించక, గుణదోషములు, బిరుదులు, అంతస్థులు పాటించక, ఆశ్రమవాసముల తలచక, స్త్రీ పురుషులను భేదములేక, గర్భిణి స్త్రీలు కూడ శ్రవణముచేయుటకై క్రమము తప్పక, శ్రద్ధతో ప్రతిదినము సమావేశమగుచుండిరి.

ఈ ఖండ మారంభమగుటతో, స్త్రీ లెల్లరు వెళ్ళవలెనని ఆజ్ఞాపింపబడలేదు. గర్భిణీస్త్రీలు మాత్రము, రాగల ఐదు మంత్రముల విచారపర్యంతము, స్వల్పకాలము, విరమించవలెనని కోరబడిరి. ఇట్లు సూచించుటకు వారియెడ అసూయలేదు. కనికరము లేకపోలేదు. ఒక గొప్ప మనోవైకల్య సిద్ధాంతము ననుసరించి, ఇట్లు నియమింపబడెను. వేదకాలమున, మననుగురించి, శాస్త్రపరిశోధన విస్తారముగ నుండెనని తెలియుచున్నది. గురువులు నేర్చిన విజ్ఞానమును, ప్రతి వ్యవహారమున ఉపయోగించుచుండిరి. శిష్యులతో మెలగునపుడు, సమాజమున వ్యవహరించునపుడు, ముఖ్యముగ తమ జ్ఞానమును యుపయోగించుచుండిరి. ఈ మర్మమును తెలియక, పై మంత్రమునగల నాటక విజ్ఞాపనమువినుటవలన, స్త్రీలు వేదముల శ్రవణము చేయకూడదనియు, వేదములందలి కొన్ని భాగములను మాత్రము వినకూడదనియు, తలచుచున్నారు. ఇట్టి దురభిప్రాయములు విదేశీయులకుండుట సహజమని యెంచవచ్చును. కాని, స్వదేశీయ హిందూమత పండితులుకూడ ఇట్టి అవివేక అభిప్రాయములను తొలగించుకొనలేక, మతమునకు హీనదశ కలిగించగలిగిరి. లేక హీనదశ కలుగుటకు సహకారులైరి.

వ్యక్తియందు, సమాజమునందు, కలుగుచుండు మనోవైకల్యములను, మహాఋషులు చక్కగ నెరుగుచుండిరి. సమాజమునగల లోపములను, తమ జ్ఞానము వలన తొలగించుచుండిరి. సద్విషయముల బోధించుచుండిరి. మానసిక ప్రమాదములను చక్కబెట్టుచుండిరని పురాణములు తెలుపుచున్నవి.

హిరణ్యకశ్యపుడను అసురుడు, సుగుణములేనివాడని, విషయలోలురగు తన తరమువారినెల్ల, హిరణ్యకశ్యప సమాజముగ తయారుజేసెను. ఇంద్రున కీ విషయము తెలిసి భయపడెనని, పురాణము తెలుపుచున్నది. హిరణ్యకశ్యపుడు హిందూమత సంతతిని, నిర్మూలము చేయుటకు, గొప్ప శక్తులను సంపాదించుటకు అడివిలో తపసుచేయుటకు పోయెను. మానవరాశికి కలుగనున్న యుపద్రవమును తొలగించుటకై, ఇంద్రుడు, అసురుల గర్భిణీ స్త్రీలనెల్ల చెరసాలయందుంచి, ప్రసవించగల శిశువులను తన స్వాధీనము చేసుకొని, స్త్రీలను వదలివేయ నిశ్చయించెను. అందువలన, రాగల తరమువారిని, అసురుల సంయోగము లేక తప్పించనెంచెను.

గర్భవతియగు హిరణ్యకశ్యపుని పట్టపురాణిని ఇంద్రుడు స్వయముగ పిలుచుకొనిపోవుచుండెను. మార్గమధ్యమున నారదుడు చూచెను. విచారించెను. ఇంద్రుని యుద్దేశము తెలిసికొనెను. ఆమెను తన స్వాధీనము చేయమని, నారదుడు కోరెను. తానామెను సురక్షితముగ కాపాడగలడని చెప్పెను.

ఇంద్రుడామెను నారదుని వశముచేసి వెళ్ళెను. భక్తి జ్ఞానములకు రూపమగు నారదుడు, సంపూర్ణ దయతో, ఆమెను వశిష్టుల ఆశ్రమమున చేర్చెను. ప్రసవకాల మాసన్నమగువరకు, ఆమె, ఆ యాశ్రమవాసమున, ప్రతినిత్యము వేదాంత శ్రవణము చేయుచు, శక్త్యానుసారము ఆశ్రమమునకు సేవ జేయుచుండెను. ఇంతలోగ, హిరణ్యకశ్యపుడు తపసు ముగించి నగరము ప్రవేశించెను. అతని భార్య అతనిని చేరుకొనెను. సకాలమునకు కుమారుడు జన్మించెను. అతడే అమృత స్వరూపుడు, పురాణపురుషుడు అగు ప్రహ్లాదుడు.

ఈ కథవలన, పాఠశాల ఆవరణములందు, ఆశ్రమములందు, శరణాలయములలో, కళాశాలలందు, సమాజ జీవితమున, సామూహిక సంస్కారమువలన, ఉన్నతదశ పొందవచ్చును, లేక, అధోగతి కలుగ

వచ్చును, అని తెలియుచున్నది. గర్భవాసముననే జ్ఞాన బోధ మొసగుట సాధ్యమని, పాశ్చాత్యులిటీవల కనుగొనియున్నారు. కనుగొనుటకాదు. వారే ప్రథమమున కనుగొనగలిగిరని, ప్రతిష్ట చేసుకొనుచున్నారు. హిందూమతమునందలి వేదవాఙ్మయమును పరిశీలించినచో, వేదకాలమునుండి సంఘసంస్కారమున కిదొక ముఖ్యసాధనగ నుండెనని తెలియుచున్నది.

తల్లి భుజించు ఆహారము జీర్ణమయి, రసస్వరూపముగ, గర్భమునందు శిశువుయొక్క దేహనిర్మాణమునకు, రూపమునకు, తోడ్పడుచున్నది. అదేవిధముగ గర్భవతియొక్క ఆలోచనలు, శిశువుయొక్క మానసిక వికాసమునకు బలవర్ధకమగుటలో సంశయముండ బోలదు. తల్లి గర్భవతిగనుండు సమయమున, భయకంపములు, ప్రమాద సంఘటనలు కలిగియుండినచో, జన్మించు శిశువునకు ఉన్మాదము, అపస్మారము, మానసిక బలహీనత యేర్పడునట్లు వందలకొలది నిదర్శనములు చూచుచున్నాము. నవయుగమున, నూతలు, సినిమా ప్రదర్శనములు, ఆటలు, పాటలు, వేడుకలు, విరామములేక సాయం సమయములనే గాక, విచ్చలవిడి విహరించుచుండుటవలన, వారికి కలుగు సంతతి, యుక్తవయసు వచ్చుటకు పూర్వమే అనేక వ్యభిచార వ్యవహారములకులోనై, జాతీయ సమస్యలను కలిగించుచున్నారు.

ఈ ఖండమున గర్భవాసము చేరిన రేతను, శిశురూపమున జన్మించి, అభివృద్ధిపొందు క్రమము వర్ణింపబడుచున్నది. కనుక, గర్భిణి స్త్రీలు, ఇట్టివిషయములను విని, వ్యామోహభావముల పాలుకాగలరు. తత్ఫలితముగ, జన్మించగల శిశువుల మానసిక సమత్వము విచ్ఛిన్నమై, హిందూమతమునకు లోటు కలిగించగలదని ఋషి అభిప్రాయము. కనుక, గర్భిణి స్త్రీలు నిష్క్రమింతురుగాక, యను విజ్ఞాపన ఇందు కలదు.

జీవవికాసక్రమము, స్థావరములగు రాళ్ళనుండి, క్రమముగ అభివృద్ధిపొంది, వృక్షములు, క్రిములు మృగములుగ మారి, మానవజన్మ మెత్తుచున్న విధానమీ మంత్రమున తెలియనగును. అహంకార పూరిత జీవకేంద్రము అవ్యక్తముగ రాళ్ళయందుండును. ప్రకృతి పరిపాకము వలన, వర్షమున, ఎండలందు విచ్ఛిన్నముపొంది, ఒక సూక్ష్మ అణువగుచున్నది. అట్టి అణురూపమున యుగముల పర్యంతము వేచియుండి, ఒక చెట్టువేరు మూలమున వృక్షరూపమును చేరుచున్నది.

వృక్షమున, ఆకులు, రెమ్మలు, బోద, బెరడు, ఏదో యొక రూపమున అది యుగముల పర్యంతము యుండగలదు. లేక యొక ఫలరూపముపొంది, అది భూమిపైబడి మరొక చెట్టుగా పుట్టవచ్చును. లేక ఒక మృగమా ఫలమును భుజించినచో, అది దాని యంగములందు చేరును. ఆ మృగము మరొకమృగముచే భక్షింపబడును. ఇట్టి పర్యవస్థయందు ఆ ఫలము నొక గోవు భుజించియుండిన, అది పాలరూపమున బైటికిరాగలదు. ఆ పాలనొక పిల్లి త్రాగక, యజమానుడు త్రాగియుండినచో, అతని దేహమున అది యొక యెముకలో చేరును.

అదృష్టవశమున, పాలరూపము పొందిన జీవుడు, యజమానుని యెముకయందు చేరక, అతని రేతసునందు చేరినచో, ఆ రేతసు లనేకపర్యాయములు వ్యర్థమగుచుండును. అదృష్టవశమున ఆ రేతసు వ్యర్థముగాక, తెలివిగల స్త్రీగర్భమున ప్రవేశించినచో, ఆమె ఆరోగ్యము, దేహనిర్మాణము చక్కగనుండినచో, ఆ జీవుడొక మానవాకారముపొంది జన్మించును. అతని ఆరోగ్యము, అంగసౌష్టవము సమముగ నుండినచో, చక్కని మనోబుద్ధులు కలవాడై, ఈ యజ్ఞశాలయందు సమావేశమైయుండు మనలో ఒకరివలె వృద్ధిపొంది యుండగలడు. ఇట్లుండుటవలన, మానవజన్మము కలుగుట ఎంతటి దుర్లభమో, అదృష్టమో ఎఱుగలేకున్నాము. జీవితమునందలి పవిత్రత తెలుసుకొనలేకున్నాము.

బహుశః ఇదంతయు అతిశయోక్తి యగుగాక. కాని జీవిత వికాసక్రమము వేదాంతుల దృష్టికిట్లు కనబడుచున్నది. మానవజన్మమునగల పవిత్రత ఇందువల్ల స్పష్టమగుచున్నది. కనుక, మన జీవితమును సఫలము పొందజేయుటయందు ఈ జన్మమునందే ఉత్తమోత్తమ పదవి చేరుటకు, తగు ఘన ప్రయత్నములు చేయుటయందు మనకుగల ముఖ్యభాద్యత స్పష్టమగుచున్నది.

ఈ మంత్రమునందు "ఇతడు మొదటి బీజమగుచున్నాడు." అని యున్నది. ఇచ్చట "అయం" ఇతడు అనగా, వ్యష్టిరూపమున తన పూర్వజన్మకర్మల ఆలోచనల వాసనలతో కూడిన మనోబుద్ధులకు బద్ధుడగు పరమాత్మయని భావము. దీనినే జీవుడనబడును.

వ్యవహార ప్రపంచమున, తనకోరికలెల్ల తృప్తిపొందుట కొరకు వాహనము కావలెనని ఈ జీవుడు వెదకుచున్నాడు. ఈ జీవుని గురించి పూర్వభాగమున వివరములు తెలుపబడెను. అట్టి ఈ జీవుడు మొట్టమొదట ఒక శక్తిగల బీజముగ వ్యక్తమగుచున్నాడు.

మనము భుజించు ఆహారము యొక్క సారము రేతస్సుగ తయారగుచున్నదను ప్రకటన నూతన క్రిమిశాస్త్రజ్ఞుల పరిశోధనలఫలము కాదు. అది వేదకాలములందు తెలిసియుండిన సత్యమని ఈ మంత్రము తెలుపుచున్నది. తండ్రియొక్క సర్వాంగముల శక్తియు, వీర్యము, రేతస్సుగ వ్యక్తమగుచున్నదని ఈ మంత్రము ప్రకటించుచున్నది.

కనుక బీజము, మానవునియొక్క సారము. వ్యక్తి బీజరూపమున జీవించుచున్నాడనవచ్చును. కనుక వ్యక్తి తనయందు, తన స్వరూపమును ధరించుచున్నాడని మంత్రము తెలుపుట మతసిద్ధాంత సత్యవచనముగ నున్నది.

బీజమనగా, వ్యక్తియొక్క సూక్ష్మస్వరూపము. కనుక ఒక బీజము రేతస్సుద్వారా వెలువడినపుడు వ్యక్తియొక్క సారము వెలువడుచున్నది. బీజము వ్యక్తినుండి వెలువడి, ఒక స్త్రీ గర్భమున వదలబడుట వ్యక్తియొక్క ప్రథమ జన్మమగుచున్నది.

సామాన్య వాడుకయందు ఒక శిశువు గర్భమునుండి వెలువడి, భూపతనముపొంది, ప్రపంచమున తన కనుగుణముగ వృద్ధిపొందగల అవకాశ మేర్పడినపుడు, ఆ శిశువు జన్మించెననబడును. బీజరూపమున ఒక వ్యక్తి వెలువడి స్త్రీగర్భమున పతనముపొంది అందు తన కనుగుణముగ పిండరూపమున అభివృద్ధి పొందగలుగుట కూడ ఒక జన్మమగుచున్నది.

కనుక వేదాంత పరిభాషయందు, భార్యగర్భమున వీర్యపతనము సలిపిన వ్యక్తి మరల జన్మమెత్తుచున్నాడనబడును. శరీర పరిశోధక శాస్త్రజ్ఞులకు ఆశ్చర్యము కనబడగలదు. కాని వేదాంతభాషయందిదొక చక్కని సత్యవచన మగుచున్నది.

శ్రు॥ తత్ స్త్రియాం ఆత్మభూతం గచ్ఛతి యథా స్వమఙ్గం తథా తస్మాదేనాం న హినస్తి సాస్యైత మాత్మాన మత్ర గతం భావయతి.॥ (2).

(ఆ బీజము ఆ స్త్రీయందు, దేహమునందు అంగము వలె ఏకమగుచున్నది. కనుక అది ఆమెకు హాని కలిగించుట లేదు. అతనినుండి తనకు చేరిన అతని బీజమును ఆమె పోషించుచున్నది.)

గర్భమునందు బీజము చేరగనే, కాలు, చేయి, హృదయము, ప్రేగులు, మొదలగు అంగములవలె ఆమెయొక్క దేహమున ఒక భాగముగ అది కలిసిపోవుచున్నది. ఆ బీజము దేహాంగమువలె కలసిపోవుటవలన తనయందు బీజమొకటి యున్నదను భావ మామె కుండదు. దానివలన ఆమెకెట్టి ఉపద్రవము కలుగుటలేదు. కాలాను గుణముగ ఆమె భుజించు ఆహారము వలన ఆ బీజము వృద్ధిపొందుచున్నది. అందువలన గర్భవాసమున పెరుగుచుండు తన భర్తయొక్క సారమును ఆమె పోషించుచున్నది.

శ్రు॥ సా భావయిత్రీ భావయితవ్యా భవతి తం స్త్రీ గర్భం బిభర్తి సోఽగ్ర ఏవ కుమారం జన్మనోఽగ్రేఽధి భావయతి స యత్కుమారం జన్మనోఽగ్రేఽధి భావయత్యాత్మానమేవ తద్భావయత్యేషాం లోకానాం సన్తత్యా. ఏవం సన్తతా హీమే లోకా స్తదస్య ద్వితీయం జన్మ.॥ (3).

(ఆమె తనయందు అతని జీవమును పోషించుచున్నది. కనుక ఆమె చక్కని పోషణ పొందవలసియున్నది. స్త్రీ అతని పిండరూపమును గర్భమందు ధరించుచున్నది. తండ్రియగు అతడు శిశువును జన్మించుటకు పూర్వము, జన్మించిన పిమ్మటకూడ పోషించుచున్నాడు. శిశువు జన్మించినది మొదలు దానిని అతడు పోషించుచున్నాడు. కనుక అతడు ప్రపంచాభివృద్ధికొరకు తన జీవమునే పోషించుకొనుచున్నాడు. అతనికిది రెండవ జన్మము.

(సశేషము)

# గోదావరి తీరమున

(రూపకము)

శ్రీ ఆకుండి వెంకటశాస్త్రి



[ రంగ, సుశీల – బావమరదళ్ళ సంభాషణ ]

తెలుగువారికే గాక భారతదేశవాసుల కెల్ల పవిత్రమైన గోదావరీ తీరమున అదిగో ఆ కోటిలింగ క్షేత్రం - రాజమహేంద్రవర నగరము.

రంగ:-సుశీ! గోదావరి నదీతీరంలో ఉన్న క్షేత్రాల్లోకెల్ల ప్రసిద్ధమైన క్షేత్రం యిదిగో కోటిలింగాల క్షేత్రం.

సుశీల:-అబ్బా! ఎంతజనం! ప్రతిరోజూ జనం యిలా వస్తూంటారా! స్నానానికి -

రంగ:-వస్తూనే ఉంటారు. మహాశివరాత్రికి వేలకొలది జనం ఈ పవిత్రక్షేత్రంలో స్నానానికి వస్తారు. తెలుగు దేశస్థులకు పవిత్రమైన గొప్ప నదులలో లెక్కకు వచ్చేవి విజయవాడ వద్ద కృష్ణానది, రాజమహేంద్రవరము దగ్గర 'వృద్ధ గౌతమి' అనే పేరుతో గోదావరి. చాళుక్యరాజైన రాజరాజనరేంద్రుడు పాలించిన పట్టణము, నన్నయభట్టు మహాభారతమును తెలుగులో వ్రాసిన చోటు యీ రాజమహేంద్రవరము.

సుశీల:-ఎంత గొప్ప నది! కవులెవరైనా యీ నదిని తమ గ్రంథాలలో వర్ణించారా!

రంగ:-శ్రీనాథ మహాకవి కాశీఖండము, భీమఖండములోను దక్షిణ భారత దేశమునకు గంగవంటి దగుటచే 'దక్షిణ గంగ' అని వర్ణించాడు. బమ్మెర పోతన కూడ గోదావరిని 'దక్షిణ గంగ' అని వర్ణించాడు. అధునాతన కవులు చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారు, కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులుగారు గోదావరీ తీర వాసులే గదా! వారుకూడా గోదావరిని వర్ణించారు.

సుశీల:-గోదావరికి వృద్ధ గౌతమి అని పేరెలా వచ్చింది.

రంగ:-ఒకప్పుడు గౌతమ మహర్షి గోహత్య చేశాడుట. ఆ గోహత్యా పాతకాన్ని పోగొట్టుకోడానికి ఎన్నో యేండ్లు తపస్సుచేసి గోదావరి నది పుట్టుకొచ్చేటట్లు చేశాడుట.

సుశీల:-వృద్ధ గౌతమ మహర్షి యేలాగు ఈ గోదావరిని పుట్టించాడో చెప్పండి.

రంగ:-దక్షిణ హిందూదేశంలో పడమటి సముద్రతీరాన పడమటి కనుమల్లో నాసికాత్ర్యంబకము అనుచోట పుట్టి దండకారణ్యము గుండా ప్రవహించి తూర్పు కనుమల్లో పాపికొండలను ఛేదించి భద్రాద్రిరాముని పాదముల మీదుగ రాజమహేంద్రవరము, ధవళేశ్వరము, కోటిపల్లి, ద్రాక్షారామ పుణ్యక్షేత్రముల మీదుగ సముద్రనాథుని చేరుతోంది. గోదావరి నది

పుట్టినచోట నాశికాత్ర్యంబక క్షేత్రము మహారాష్ట్రములోనిది. ఇచ్చటనే మన దేశ చరిత్రలో ప్రసిద్ధమైన శివాజి జన్మించినది. ఈ నది పుట్టి ప్రవహించిన ప్రదేశమునుండి సాగరము చేరువరకు ఉన్న దేశమునంతయు సస్యశ్యామలముగా చేసినది. నవనందులకు ప్రసిద్ధి గాంచిన 'నాందేడు' క్షేత్రము ప్రవేశించినది. ఇచ్చట గొప్ప శిక్కుల దేవాలయం ఉంది. ఇక్కడ యెన్నో హిందూ దేవాలయాలున్నాయి.

**సుశీల**:-ఈ గోదావరి నది పుట్టినచోటు ఏలాగు ఉంటుందో?

రంగ:-రాజమహేంద్రవరము దగ్గర రెండు మూడు మైళ్ళు వెడల్పుగానున్న యీ నది పుట్టినచోట యేమాత్రము వెడల్పు లేక, సన్నగా ఒక మనుష్యుడు దాట తగినంత వెడల్పు కలిగిఉంటుంది. అక్కడ యెత్తైన పర్వత శిఖరాలు, లోయలు, మహారణ్యాలు కలిగి ప్రవేశింప శక్యముగాక ఉంటుంది. అక్కడక్కడ యీ నదినీరు ఎత్తైన పర్వతముల నుండి క్రిందికి దూకుతూవుంటుంది. ఆ పర్వతమయ ప్రదేశము కన్నులకింపుగ కనపడుతుంది.

**సుశీల**:-ఓహో! కవిత్వం చెపుతూన్నారే!

రంగ:-ఔను సుశీ! ఈ పవిత్ర గోదావరి నదీజలం త్రాగి ఎందరో మహాకవులు యీ గోదావరితీరాన అమరకవితను సృష్టించలేదా! పురాణదంపతులు సీతారాములు వనవాసములో సంచరించి దండకారణ్యము గుండా ప్రవహించిన యీ గోదావరి నదీజలాలకెంతైన పవిత్రత, శక్తి మహత్త్వము వుంటుంది. సంస్కృత నాటకము ఉత్తరరామచరితను వ్రాసిన భవభూతి, తెలుగు భాగవతం వ్రాసిన మన పోతనాదులు గోదావరీ తీరవాసులే సుమా! ఆది తెలుగుకవి నన్నయభట్టో! ఎక్కడివాడనుకొన్నావేమిటి?

సుశీల:-అవును. నన్నయభట్టు గోదావరీ తీరవాసుడే! ఢిల్లీశ్వరుని కొలువులో ప్రసిద్ధ సంస్కృతాంధ్ర పండితుడు జగన్నాథ పండితరాయలు గోదావరీ తీరవాసియేగదా! ఇంకా గోదావరీతీరాన గల ప్రసిద్ధ పుణ్యక్షేత్రరాజములేవో చెప్పండి.

రంగ:-తెలంగాణా ప్రాంతాన ఔరంగాబాదు యాదవరాజులు పాలించిన కేంద్రము. ఆదిలాబాదు దాటిన తరువాత గోదావరి నదిలో గంగపూరా, మంజీరా, ఇంద్రావతి, వైన్‌గంగ, శబరి, కిన్నెరసాని అను మహోపనదులు కలుస్తున్నాయి. గోదావరి నదిపై ఉస్మాన్‌సాగర్ అను డామ్‌ను నిర్మించి, లక్షల యకరాల భూమిని సాగుచేసి, ఆ ప్రదేశమంతయు సస్యశ్యామలముగ చేయుచున్నారు. గోదావరి క్రమక్రమంగా కందుకుర్తి క్షేత్రం, తరువాత శ్రీధర మహారాజు స్థాపించిన, క్రిష్ణాపూర్ క్షేత్రం దాటిపోతూంది. ఇచ్చట రామలింగేశ్వర దేవాలయం ఉంది. ఈ నది వేదవ్యాసులవారు తపస్సుచేసిన సరస్వతీ క్షేత్రాన్ని చేరుతుంది. ఈ బాసర

క్షేత్రంలో వేదవ్యాసులవారు స్థాపించిన సరస్వతీ ఆలయం ఉన్నది. లక్షలాది మహారాష్ట్రులు, తెలుగువారు సరస్వతీపూజ చేస్తారు.

సుశీల-:-ఏమండీ! ఇంతవరకూ మీరు గోదావరీ తీరాన చరిత్ర ప్రతీతిగలవి, ప్రసిద్ధమైన పుణ్యక్షేత్రాలు, అచ్చటి ప్రజలనుగూర్చి చెప్పారు కాని, గోదావరిలో వరదలు రావడం వానితీరు, తెన్నులను గూర్చి చెప్పుతారా?

రంగ:-గోదావరి నదికి అడ్డముగ ధవళేశ్వరము దగ్గర సర్ ఆర్థర్ కాటన్ దొర ఆనకట్టను నిర్మించినారు. రాజమహేంద్రవరము దగ్గర రైలును పోవుటకు గొప్ప బ్రిడ్జిని గోదావరి నదిపై నిర్మించిరి. గోదావరి ఏడు పాయలుగ చీలి బంగాళాఖాతములో కలియుచున్నది. ఈ నదికి రెండువైపులా అనేక పుణ్యక్షేత్రాలు దేవాలయాలూ కలిగి అద్భుతమైన, అత్యంతరమణీయమైన ప్రకృతి దృశ్యాలతో అలరారుచు డెల్టా అని చెప్పబడే సారవంతమైన భూఖండము అమలాపురం తాలూకా సముద్రమున సంగమించు చోటున కలదు. ఈ నది మహారాష్ట్రదేశమున జనించి, తెలంగాణా ప్రదేశములోను ఆంధ్రప్రదేశ్ లోను ప్రవహించి సాగర సంగమ మొందుచున్నది. ఈ నది సుమారు 920 మైళ్ళు పొడవుకల్గి దక్షిణ హిందూదేశము పడమటి తీరము నుండి తూర్పుతీరము వరకు విస్తరించిన పరమేశ్వరుని లీల యనదగు గొప్ప జీవనది.

—[ ఆకాశవాణి విజయవాడ కేంద్రము వారి అనుమతితో ]

---




# శ్రీవారిమచ్చ

శ్రీమతి పరానేని శ్రీశైలభ్రమరాంబ

మనుష్యుల చిత్రవిచిత్ర ప్రవర్తనలు, అనేక సంఘటనలతో ఎన్నో మరుపురాని అనుభవాలతో జీవితాలు దొర్లిపోతాయి. మా శ్రీవారిలో ఈ ఒక్క మచ్చవల్ల ఎంతమార్పు వచ్చింది!

మా శ్రీవారు చిన్నతనంలో నుంచీ కూడా తల్లి తండ్రుల గారాబంవల్ల తన మాటని ఏనాడూ కాదనక నెరవేర్చడంచేత పెంకితనం జాస్తీ అయింది. ఇరుగుపొరుగు పిల్లలతో జట్టీలు తెచ్చినా అమ్మ తననే వెనకేసుకురావడంతో చిన్నతనమంతా గడుగ్గాయితనంతో వెళ్ళిపోయింది.

హైస్కూల్లో చదివేరోజుల్లో పురోరకం అలవాట్లు వచ్చాయి. బజారువెంట తిరగడం, సిగరట్లు కాల్చడం, సినీమాలకు పోవడం ఎక్కువయ్యాయి. తెలిసీ తెలీని మిడిమిడిజ్ఞానంతో నవలలు, నాటకాలు, కథలు చదవడం, సినీమాలో హీరోలాగ క్రాపు పెంచడం, ఇత్యాదులన్నీ అలవడ్డాయి.

శ్రీవారి చర్యలకు ఫలితంగా వారి తల్లికి తండ్రికీ కూడా మనస్పర్ధలు కూడా వచ్చాయి. తన కడుపున పరమనీచుడు, దుర్మార్గుడు పుట్టినా సరే; ఆఖరుకి తన కన్నకొడుకు పాషాణంలా ప్రవర్తించినా సరే కన్నతల్లి ప్రేమిస్తుంది. కొడుకు మార్పులన్నీ కళ్లారాచూస్తూ, తనభర్త కొడుకుని ఇంట్లోంచి గెంటివేస్తానంటే, తల్లికి మనస్కరించక చాటుగా కొడుకుని పిల్చి అనేకవిధాల మందలించేది. తండ్రి మందలించినప్పుడు మాత్రం తల్లి వెనకేసుకురావడంతో మా శ్రీవారు మరీ విచ్చలవిడిగా తిరుగుతూ ఎవరినీ లెక్కచెయ్యని స్థితికి వచ్చారు.

అవి శ్రీవారు స్కూల్ ఫైనల్ చదివేరోజులు. వారి తల్లి జబ్బులో మంచంపట్టింది. ఆరునెలలు మంచంమీదనేయుండి అవకాశం చిక్కినపుడల్లా కొడుక్కి ఎన్నో హితబోధలు చేసేది తల్లి. కాని ఏంలాభం? "దాలిగుంటలో కుక్క" అన్నట్లుగా వులిపేసేవారు.

స్కూల్ ఫైనల్ పరీక్షాఫలితాలు తెలిసి తన కొడుకు ప్యాస్ అయ్యాడు అన్న వార్త వినకుండానే తల్లి కన్నుమూసింది.

యింటర్‌కి కాలేజీలో చేర్పించారు తండ్రి. ఇంక కాలేజీ జీవితంలో ఇంకోమార్పు వచ్చింది. శ్రీవారిలో- అందమైన అమ్మాయిల్ని చూచి వేటాడడం, వాళ్లు తనకేసి ఒక్క క్రీగంటిచూపైనా ప్రసాదించకపోవడంతో వాళ్ళని గురించి తనలాంటి మిత్రులకే సిఫార్సుచేసి మనలో ఎవరైనాసరే ఆ బ్యూటీఫుల్ గరల్‌తో ఫ్రెండ్‌షిప్ చెయ్యమని ప్రోత్సాహమిచ్చేవాడు.

ఓరోజు శ్రీవారు కాలేజీ వదిలే సమయానికి గేటుదగ్గర హాజరుగా నిలబడి తన క్లాస్‌మేట్ సుగుణ అనే అమ్మాయి ఇంటికిపోతూంటే బాడీగార్డులా వెనకాలే బయల్దేరాడు. కొంతదూరం వెళ్లాక "మిస్టర్ సుగుణ" అని పిల్చాడు.

పాపం! తన పిలుపుకి ఉబ్బితబ్బిబ్బై చిరునవ్వుతో జవాబిస్తుందనుకున్నా సుగుణ కళ్లెర్రచేస్తూ కోపావేశంతో "పటప్ ఫూల్" అని గర్జించి గిర్రున వెళ్ళిపోయింది వెనక్కి తిరిగి చూడకుండా.

ఇల్లాంటి సంఘటనలకు కూడా బెదరక శ్రీవారు తనకంటికి అందమైన అమ్మాయి కన్పిస్తే ఆమెతో కాస్తోకూస్తో ప్రేమసయ్యాటలు జరపడం, అందుకు విపరీతంగా ప్రవర్తించే సుగుణవంటి వాళ్ళకు భావగీతాలు, ప్రేమలేఖలు, విరహవేదనను సూచించే పద్యములు, తన ప్రేమమయకవిత్వాన్ని అంతా పోస్టుద్వారా వాళ్ళకి పంపించేవాడు.

ఇల్లాంటి అవినీతి ప్రవర్తన మా శ్రీవారి మనస్సుకి అలవాటైపోయింది. ఈ విధంగానే ఇంటర్ గెంటుకు వచ్చారు.

బి.ఏ.కి యూనివర్సిటీ కాలేజీలో చేర్పించారు శ్రీవారిని. యూనివర్సిటీలో చేరాక ఇంక యిల్లాగ చిల్లరప్రేమలతో దోబూచులాడడం తన స్టేటస్‌కి

భంగకరమని కట్టిబెట్టాడు ఇల్లాంటి చిలిపిచేష్టలన్నీ. కాని ఇంకోరకంగా మారారు మా శ్రీవారు.

బి.ఏ. లో తన క్లాస్‌మేట్ రాధ అనే అమ్మాయి వారిని ఆకర్షించింది. రాధ, శ్రీవారు వీరిద్దరూ ముందు నోట్సులు మార్చుకోవటంతో స్నేహం ప్రారంభించి నాల్గు నెలల్లో ప్రేమలోకి దిగారు. అల్లాగే ప్రేమలో తన్మయులై బుడుగూ బుడుగూ మంటూ ప్రేమ పయ్యాటలతో ఈతలాడేవారుట ప్రణయసాగరంలో.

రాధ, శ్రీవారు ఎప్పుడూ ఒకరినొకరు వదలి యుండకుండా [అంటే క్లాసుటైముల్లో తప్ప] షికార్లు, సినీమాలు, పార్కులు, ఒకచోటేమిటి బెంగుళూరు అంతా వీళ్ళు స్వేచ్ఛావిహారం చెయ్యని వీధంటూ లేదు. వీరు చూడని స్థలంలేదు.

అల్లా శ్రీవారు-రాధ వారిద్దరూ ఆకాశమార్గాన్ని విహంగాల్లా స్వేచ్ఛగా ఎగిరిపోదామనీ, ప్రేమగాలిని పీలుస్తూ, ప్రణయంలోనే బ్రతుకుతూ, రాధాకృష్ణుల వలె కేళీవిలాసంగా యుందామనీ కలలుకంటూండే వారట. వీరి ప్రణయగాధ ప్యూన్ మొదలు, ప్రిన్సిపాల్ దాకా అందరికీ తెలియడంతో గోడలమీద వ్రాతలతో కొన్నాళ్ళు పరోక్షంగా మరికొన్నాళ్ళు అనుకొని చివరకు — "నీ ప్రేయసి ఏదిరా?" అని మావారిని. "మీ ప్రియుడు ఏడని?" రాధని ముఖాముఖీని అడగడంవరకూ వచ్చింది కాలేజీలో గొడవ.

ఇంక ఈ ప్రేమజంట స్మృతిమించి రాగాన్న పడ్తాంటే రాధ తల్లితండ్రులకి తెలియచేసారు. కూతురు భవిష్యత్ సర్వనాశనం కాకుండా వెంటనే తగినసంబంధం చూసి తపీమని పెళ్ళిచేసారు రాధకి ఓ యం.ఎ. చదువుకున్న యువకునితో.

నాల్గురోజులు రాధ కాలేజీలో కన్పించకపోయే సరికి ఎందుకు రాధ రావడంలేదా? అని ఆదుర్దాతో మనస్సును గట్టిపరచుకుని అల్లాగే పదిరోజులు ఎదురు చూచాడు రాధ కోసం శ్రీవారు.

ఇంక శ్రీవారి అవస్థ చెప్పాలి అంటే అది వర్ణించి చెప్పడానికి మాటలు చాలవేమో! కాలేజీలో స్టూడెంట్సునీ, చెట్లనీ, గోడల్నీ, క్లాసులో బెంచీలనీ, కుర్చీలనీ, గేటువాచర్నీ, ఒకరినేమి, తనకంటికి కనపడ్డ ప్రతీమనిషినీ కూడా "రాధ ఏదీ? ఎక్కడుందీ?" అంటూ అడిగేవారట శ్రీవారు. "రాధ యం.ఎ. చదువుకునే స్టూడెంటు భార్య అయింది. ఇంక కొన్నినెలల్లో మన కాలేజీకి లెక్చరర్ అవుతాడు రాధ భర్త" అని సజీవమైనవారూ, నిర్జీవమైనవీ కూడా ఏకగ్రీవంగా సమాధానమిచ్చారు మా శ్రీవారికి.

శ్రీవారి ప్రేమహృదయం చితికి రాధ వియోగ దుఃఖాగ్నికి భరించలేక ఆత్మహత్య చేసుకునే పరిస్థితికి వచ్చాక తండ్రి జాగ్రత్తగా మా శ్రీవారిని చేరదీసి ఊరడిమాటలతో కొడుకు ప్రాణాల్ని రక్షించుకొన్నారు. కొన్నాళ్ళు ఇంట్లో జాగ్రత్తగాయుండి తండ్రిగారి మందలింపులతో తమాయించుకుని శ్రీవారు బి.ఏ. పరీక్షకు వెళ్ళారు. ఎన్ని వెర్రిమొర్రి వేషాలువేసి, ఎల్లా తిరిగినా, పుస్తకం చేత్తోపట్టుకు చదువుతుంటే మాత్రం సర్వం మరచిపోయి చదువులో లీనమైపోయి, చదివిన ప్రతీవిషయం మెదడులో స్థిరనివాసంతో యుంచుకోగల సమర్థులు కావడంచేత బి. ఏ. సెకండు క్లాసులో ప్యాసయ్యారు మా శ్రీవారు.

ఇంక చదువుకు స్వస్తి చెప్పదామనుకొన్నారు మా శ్రీవారు. కాని రాధను పెండ్లాడిన భర్త యం.ఎ. ప్యాసయి నీకంటె ఉన్నత విద్యాపరుడు అనిపించుకొంటుంటే నువ్వు బి.ఏ.తో ముగిస్తే "ఇందుకే నిన్ను పెళ్ళాడలేదని రాధ ఏనాటికైనా నిన్ను అపహాస్యం చేయవచ్చు. ఆ ఆడదానిచేత పౌరుషహీనుడులా మాటపడ్తావా భాయీ! రాధ భర్తతో సమానహోదా పొందడానికైనా, యం.ఎ. చదవమని స్నేహితులు హెచ్చరించడంతో మా శ్రీవారికీ ఉత్సాహం పుట్టింది. తానే రాధ భర్తకంటె ఔన్నత్యంగా యుండాలని అభిలషించి, మా శ్రీవారు యం.ఎ.లో చేర్తానన్నారట.

ఈ యం.ఎ. ఏలాంటి అభావచేష్టలు చెయ్యకుండా జాగ్రత్తగా చదువుకొంటేనే నీకు డబ్బు ఇస్తాకాని లేకపోతే బిల్లు కానీకూడా యివ్వనని తండ్రి నిక్కచ్చిగా చెప్పడంతో, తండ్రి ఆజ్ఞకు బద్ధుడై శ్రీరామచంద్రునిలా ఉంటానని ఒప్పుకొని, యం.ఎ.లో చేరారుట మా శ్రీవారు.

తనమాటపై చాలా పట్టింపుకలవారు మా శ్రీవారు. తన కాలేజీ, తప్పితే ఇంట్లో చదువుకోవడం తప్పించి ఈ ప్రపంచంలో తనకేమీ సంబంధంలేనట్లు ప్రవర్తించి, తీరికసమయాల్లో మాత్రం ఓమూల కూర్చుని ఆలోచించుకుంటూ గడిపేవారుట మా శ్రీవారు.

ఏలాంటి ఒడిదుడుకులూ లేకుండా చల్లగా యం.ఎ. ప్యాసయ్యారు. రాధ భర్తతో పోటీకి నిలబడ్డాననే గర్వంతో పొంగిపోయారు శ్రీవారు.

ఓరోజు తండ్రిగారు పిలిచి, "నాయనా! ఇంక నీ చదువు పూర్తయింది కాబట్టి త్వరగా పెళ్ళి చేసుకో. చిలకా గోరింకల్లా, కొడుకూ కోడలూ ఇంట్లో తిరుగుతూంటే చూడాలనివుంది" అని మా శ్రీవారితో చెప్పారు.

"నాన్నా! ఎవరినైనా బాగా ప్రేమించేసాక ఇంక మరొకరిని పెళ్ళిచేసుకోలేను. ప్రేమ ఒకరిమీద, పెళ్లి మరె ఒకరితోనూ జరగడం అసంభవం, ఇంక జీవితాంతం ఇల్లాగే బ్రహ్మచారిగా యుండదల్చుకున్నానన్నారుట" మా శ్రీవారు.

"నామాట విని నువ్వు పెళ్లిచేసుకు సలక్షణంగా కాపురం చేస్తావా నా యింట్లో యుండు. లేదన్నావా? నా ఆస్థిలో ఒక్కకానీ కూడా నీకు రాదు. నీకూ నాకూ సంబంధంలేదు. నీ తల్లి నీమీద కొండంత ఆశ పెట్టుకుంది కాని, ఏదీ కొనసాగకుండానే అది యీ లోకంనుంచి విముక్తిపొందింది. నిన్నింత వృద్ధిలోకి తీసుకొచ్చి, నువ్వు చేసే గౌరవ భంగమైనపన్లు అన్నింటికీ సహించుకొంటూ ఇంత వరకూ నిన్నేనాడూ నేను ఏ విషయానికీ నిర్బంధించడంలేదు. కాని యీనాడు నువ్వింక పెళ్ళి చేసుకోకుండా చెడిపోతానంటే మాత్రం నేను సహించను" అని శ్రీవారి తండ్రి ఖండితంగా చెప్పేశారు.

"నువ్వెంత చెప్పినాసరే నేను మాత్రం పెళ్ళి చేసుకోనంటే చేసుకోనని ఖచ్చితంగా చెప్పారుట" మా శ్రీవారు.

మాటమీద మాట పెరిగి తండ్రి కొడుకును అనరాని మాటలు అన్నాడుట. అకారణంగా కొడుకు తనమాటను పూర్తిగా తృణీకరించి పెళ్లిచేసుకోను అనేసరికి మా శ్రీవారి తండ్రిలోవున్న సంస్కారం, జ్ఞానం, ఓర్పు అన్నీ హుష్‌మని ఎగిరిపోయాయి. కొడుకును ఇంట్లోంచి వెళ్ళిపొమ్మన్నాడు. కొడుకు గృహస్థుఅయి గౌరవంగా జీవించడానికి ఒప్పుకోలేదనే అహంకారంతో, ఉన్నతమైన హృదయాన్ని, మానవత్వాన్నే మరచిపోయి తక్షణం నా యింట్లోంచి పొమ్మని గెంటి తల్పులేసుకున్నారుట శ్రీవారి తండ్రి.

మా శ్రీవారికి తనలోయున్న పట్టింపు, స్వతంత్రేచ్ఛ, తనకు యం.ఎ. డిగ్రీ యుందన్న గర్వం, తండ్రి చేత మాటలుపడ్డా అహంకారం అన్నీకల్సి మనస్సులో కలవరపెట్టాయిట. ఇంక తండ్రిని ఏ విధంగానూ అర్థించడంగాని, తండ్రి చెప్పినట్లు పెండ్లి చేసుకోవడంగాని తన మనోనిశ్చయానికి వ్యతిరేకమని భావించి, వెంటనే ఇల్లు వదలి వెళ్ళిపోయారుట మా శ్రీవారు.

తన డిగ్రీతో ఎల్లాగైనా ఉద్యోగం సంపాదించి ఎప్పటికైనా తండ్రి ఎదుటనే ధైర్యంగా బ్రతకాలని ఆశతో ఆ ఊరు వదలి వెళ్ళిపోయారు మా శ్రీవారు.

ఉద్యోగ ప్రయత్నంలో రోజులు, వారాలు, నెలలుకూడా గడిచిపోతున్నాయేకాని ఎక్కడా ఏ ఉద్యోగం దొరకలేదట శ్రీవారికి. కాళ్లు అరిగిపోయేలా తిరిగారు; ఎంతోమందిని ఆశ్రయించారు; దేశంలోయుండే అన్ని ఆఫీసులు చూచారు; అన్ని విధాలా ప్రయత్నించారు; అవమానానికి గురియై, చీవరింపులకీ; చీత్కారాలకీ; పాల్పడ్డాడు. ఇకిలింపులూ సకిలింపులేకాని ఇస్తాం ఉద్యోగం అన్న మానవులులేరు. ఈవిధంగా సంవత్సరం గడిచింది. తినతిండికీ, కట్టబట్టలే కరువై తిన్నస్థలంలో నిద్రపోక, నిద్రపోయినచోట మళ్ళీ నివసించక ఉద్యోగాన్వేషణలో బికారిలా తిరుగుతూ పిచ్చివానివలె అయ్యారుట చివరకు శ్రీవారు.

ఈ సంవత్సరంలోనూ మా శ్రీవారితండ్రి కొడుకు కోసం బెంగతో నానాటికీ కృశించి మంచంపట్టారు. చివరకు డాక్టర్లు "ఇంక మీరు ఎంతోకాలం జీవించరు; కొన్నిరోజులకంటే ఎక్కువ జీవించేస్థితిలో లేరు. మీ మనోవ్యాధి తగ్గితే బహుశా జీవించే అవకాశం యుండొచ్చు" అనికూడా చెప్పేశారు శ్రీవారి తండ్రికి.

తన ఇంట్లోంచి వెళ్ళిపోయిన కొడుకు ఏమయ్యాడో; ఎక్కడున్నాడో; అసలు జీవించి యున్నాడో; లేదో కూడా ఆయనకు తెలీకపోవడంతో, కొడుకు ఇంట్లోంచి వెళ్లిపోడానికి తానే కారకుడనని పశ్చాత్తాపంతో కుమిలిపోయి రాత్రింబగళ్ళు ఏడ్చాడు ఆ తండ్రి.

కొడుకు కోసం అన్నివిధాలా ప్రయత్నించి విఫలుడై చివరకు తనకొడుకు ఫోటోతోసహా వార్తాపత్రికలో వేయించి, తన కొడుకును తీసుకొచ్చి తనకు ఒప్పగించినవారికి అయిదువందల రూపాయిలు బహుమతి అని ప్రకటించారు శ్రీవారి తండ్రి.

న్యూస్‌పేపరు (దినపత్రిక) చదువుకునే స్థితిలో కూడా లేరట మా శ్రీవారు. ఆరోజుల్లో, కలకత్తా మహానగరంలో రోడ్లపై బికారిగా తిరిగే మా శ్రీవారిని పట్టుకుని మా బాబయ్యగారు దగ్గరుండి స్వయంగా తీసుకెళ్లి వారి తండ్రికి వప్పగించారుట.

చచ్చిపోయిన కొడుకు పునర్జీవితుడైనట్లు, పోగొట్టుకొన్న అమూల్యవస్తువు తనకు దొరికినట్లు, పేదకు బంగారునిధి లభించినట్లుగా కొడుకును చూడగానే అపరిమితానందభరితుడై పోయాడుట శ్రీవారి తండ్రి.

ఆ తండ్రీ కొడుకు లిద్దరూ గాఢాలింగనం చేసుకుని కన్నీరు ప్రవాహంలా కార్చేవారేకాని ఒక్కరికీ చాలాసేపు నోటమాటలే లేవుట. ఇద్దరూ పశ్చాత్తాపంతో దుఃఖిస్తున్నారేకాని వారిలో ఇంకేలాంటి భేదభావంలేదు ఆ తండ్రీ కొడుకులకు.

"నాయనా! నా అంత్యసమయంలో ఇంక నువ్వెక్కడికీ వెళ్ళక నాదగ్గరే ఉండిపోరా శ్రీనివాసూ! నే చేసిన నేరానికి ఈ ఏడాదినుంచీ పదిరెట్లు శిక్ష అనుభవించా" అంటూ భోరున ఏడ్చాడు తండ్రి.

దీనవదనంతో కన్నీటిధారలతో చెప్పే తన తండ్రి మాటలు ఆ తండ్రి పవిత్రప్రేమను గుర్తించేసరికి కరుడు కట్టిన మా శ్రీవారి హృదయం కన్నీటిధారలై ప్రవహిస్తూంటే, "నాన్నా! నువ్వేం చెయ్యమంటే అది తప్పకుండా చేస్తా నిన్నొదిలి ఎక్కడికీ వెళ్ళను" అంటూ తండ్రి పాదాలకి కన్నీటితో అభిషేకం చేశారు మా శ్రీవారు.

"నాయనా! యీ వార్ధక్యంలో నాకు ఉపచారం చెయ్యడానికీ, నీ బ్రతుకును సక్రమమార్గంలో నడిపించడానికీ గృహలక్ష్మి కోడలు కావాలి. నువ్వు పెళ్లిచేసుకుని నా కళ్ళముందు సంసారం చేస్తూంటే చూచి హాయిగా నిశ్చింతగా చచ్చిపోవాలని ఉంది" అని ప్రాధేయతగా కోరారు తండ్రి శ్రీవారిని.

"నాన్నా! నీమాట కెదురు చెప్పను. నీ కోరిక ప్రకారం తప్పకుండా పెండ్లిచేసుకుంటా. నీ మనోభీష్టం నెరవేర్చడమే నా ముఖ్యకర్తవ్యంగా భావిస్తున్నా" అన్నారు నిశ్చలంగా మా శ్రీవారు.

ఈ మాటలన్నీ వింటూ నిల్చున్న మా బాబయ్యగారి మనస్సులో హఠాత్తుగా నేను గుర్తొచ్చానుట. అప్పుడు వెంటనే ఈ సదవకాశాన్ని పోగొట్టుకోకుండా మా బాబయ్యగారు, "ఏమండీ! మా అన్నగారి అమ్మాయి ఒకర్తియుంది. పద్దెన్మిదేళ్ళ వయస్సు చిన్నతనంలోనే తల్లిదండ్రులు పోయారు. అప్పటినుంచీ మా యింట్లోనే వుంది. పేరు సుబ్బలక్ష్మి. ఆ అమ్మాయి రూపురేఖలు, సుగుణసంపత్తి, ఆ తెలివితేటలు చాలా ఎన్నతగ్గవి. మా సుబ్బలక్ష్మి వంటి అమ్మాయి వేయిమందిలో ఒక్కరుకూడా యుండరని చెప్పడంలో అతిశయోక్తి లేదనుకుంటున్నా. మీకు అభ్యంతరం లేకపోతే ఆ అమ్మాయిని చూచుకుని నచ్చితే మీ కోడలుగా స్వీకరించమని వేడుకుంటున్నా" అన్నాడు వినయవిధేయతగా మా బాబయ్య.

"అమ్మాయిని చూచుకున్నాక అబ్బాయి మనస్సుకి నచ్చితే నా అభ్యంతరం ఏమీలేదు. నేను మంచంమీదనుంచి లేవలేనిస్థితిలోయున్నా. అన్నింటికీ మా అబ్బాయిదే ఇష్టం" అని తండ్రి మా శ్రీవారి ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూశారుట.

"మీ అమ్మాయి మా నాన్నగారికి కోడలు కాబోతుంది కాబట్టి ఆయన కూడా చూడాల్సిన బాధ్యులు. నా సర్వస్వం మా తండ్రిగారే. అన్ని విధాలా వారికి నచ్చిన కన్యనే నేనూ నిరభ్యంతరంగా చేసుకుంటా. మీరు మీ అమ్మాయిని మా యింటికి తీసుకువచ్చి చూపించడం సబబుగా యుంటుందని నా అభిప్రాయం" అన్నారు మా శ్రీవారు.

వెంటనే మా బాబాయి వచ్చి ఒక సుముహూర్తాన నన్ను ప్రయాణంచేసి మా శ్రీవారికి చూపించడానికి తీసుకువచ్చారు. ఎన్నో ఆలోచనలతో ఇంటిదగ్గరనుంచి బయలుదేరా. సరిగ్గా వారి గుమ్మంలోకి వచ్చేసరికి వీధి గుమ్మంలోనే మా శ్రీవారు కన్పించారు, వారు నన్నూ, నేను వారినీ చూసుకోవడంతో మా చూపులు ఏకమై ఏదో మత్తుమందు చల్లినట్లుగా అయిపోయాం. మా శ్రీవారు నన్ను గురించి ఎల్లా అనుకున్నా నేను మాత్రం వారికి భార్యగా యుండడం నా పూర్వజన్మ స్వకృతమని ఆనందంతో పొంగిపోయా. ఇంక మా శ్రీవారి తండ్రి నన్ను చూచి పరమానందంతో తమకు కోడలుగా యుంటేనే చాలునని మురిసిపోయి ముగ్ధుడైనారు.

తండ్రీ కొడుకుల అంగీకారంతో పెళ్లి ప్రయత్నాలు శరవేగంగా సాగించి వారంరోజుల్లో నన్ను మా శ్రీవారి ధర్మపత్నిగాచేసి మా బాబయ్య తన బాధ్యత తీర్చుకు వెళ్ళిపోయాడు. ఆయన నాకు పినతండ్రి అయినందుకు నన్ను తగిన వరుని కివ్వడంతో ఆయనకు నేనే ఋణపడ్డానని భావించా.

మాకు వివాహమైన నెలలోపునే మా శ్రీవారికి ఉద్యోగమైంది. మామగారు కూడా నేనుచేసిన ఉపచారములవల్లనైతేనేమి, డాక్టర్లు యిచ్చే మందుల ప్రభావంవల్లనైతేనేమి; కొడుకు సుఖంగా ఉద్యోగంచేస్తూ సుఖంగా సంసారం చేస్తూన్నందు

వల్ల కల్గే ఆనందం చేతనైతేనేమి; రెండు నెలల్లో పూర్తిగా కోలుకొని మంచి ఆరోగ్యవంతులయ్యారు.

నేనూ మా శ్రీవారూ రోజులు నిమిషాల్లాగ ఆనందతన్మయత్వంలో దొర్లించేసాం ఆరుమాసాలు. అంతలోనే నేను తల్లిని కాబోయే సూచనలు కన్పించాయి. మామగారికి తాతగారౌతున్నానని ఎంత సంతోషించారో, మా శ్రీవారు తండ్రి కాబోతున్నందుకు అంత అసహ్యించుకొన్నారు. మా శ్రీవారు తనకి పిల్లలంటే పరమ అసహ్యమని సూటిగా చెప్పేవారు. అయినా మావారు ఎంత ఏవగించుకున్నా జరిగిపోయిందానికి దైవమే బాధ్యుడని ఊరుకొన్నా. లేడీ డాక్టరు సహాయంతో ఇంక ఇల్లాంటి పిల్లల ప్రమాదం లేకుండా తప్పించుకోమని చక్కటి సలహా శాంక్షన్ చేశారు మా శ్రీవారు. అందుకు నేను సుతలామూ ఒప్పుకోలేదు. స్త్రీకి భార్యాత్వం తర్వాత మాతృత్వమే కదా ఆనందదాయకమైంది.

ఓరోజు మా శ్రీవారు కాలేజీనుంచి సాయంకాలం ఇంటికి వచ్చేసరికి "నీకు కొడుకు పుట్టాడు. నేను తాతనయ్యాను" అంటూ పరమానందంతో చెప్పారు మా మామగారు.

"అబ్బాయికి పేరు ఏమని పెడదామండీ?" పురుడు వెళ్ళాక అని శ్రీవారిని అడిగానవ్వుతూ.

"నాకేం తెలీదు. మీ ఇష్టమొచ్చినపేరు పెట్టవచ్చు" చాలా కటువుగా జవాబిచ్చారు మా శ్రీవారు.

నేనూ మా మామగారు ఏకీభవించి మా మామగారి పేరుపెట్టాం అబ్బాయికి.

మా శ్రీవారి మొర ఆ భగవంతుడు ఆలకించకపోవడం చేతనో! మా మామగారికి ఆనందం ద్విగుణీకృతం చెయ్యడానికో! లేక నా అదృష్టం వల్లనో చెప్పలేంకాని, మొదటి అబ్బాయి పుట్టి రెండు సంవత్సరాల్లో మళ్ళీ వాడికో తమ్ముడుకూడా పుట్టాడు.

ఇద్దరు బిడ్డల తండ్రి అయ్యేసరికి మా వారికి పిల్లలమీద ద్వేషం నామీద అసూయా ఎక్కువయ్యాయి. క్రమంగా నాపై అనురాగంకూడా వారిలోనుండి దూరమైపోతూంటే మళ్ళీ పరస్త్రీల మీద వ్యామోహం మొదలైంది.

ప్రొద్దుట భోంచేసి పదిగంటలకి కాలేజీకి వెళ్ళడం. మళ్ళీ సాయంత్రం ఇంటికి వచ్చీ రావడంతో షికారుకంటూ వెళ్ళి రాత్రి మొదటి ఆట సినిమా అయ్యాక రావడం. శ్రీవారి భోజన సమయంలో పిల్లలమాట వినిపిస్తే అన్నందగ్గరనుంచి లేచిపోవడం. 'అయ్యో! అన్నం తినండి' అని నేనంటే దేహశుద్ధి, దవడ వాయిద్యం చెయ్యడం. ఇల్లా తయారయ్యారు శ్రీవారు చివరకి.

మా మామగారు మాత్రం ఇంక కొడుకునుగురించి ఏమీ పట్టించుకోవడంలేదు. రోజూ ప్రొద్దున్న మాత్రం శ్రీవారు టైముకు భోంచేస్తున్నారా? లేదా? అని మాత్రం చూస్తుంటారు. అంతే మిగతా అన్ని సమయాల్లోనూ ఆ మనుమలు యిద్దరే ఆయన సర్వస్వం. ఆయన ప్రాణంగా చూచుకొంటూ వాళ్ళతోనే ఆడుతూ, తానూ ఒక పసిపిల్లవానివలె ప్రవర్తిస్తూంటారు.

దైవంకూడా మా శ్రీవారి కోర్కెను నిరాకరించినట్లుగా మూడోసారి మాకు ఆడపిల్ల పుట్టింది. అంతే ఇంక ముగ్గురు బిడ్డల తల్లినైన నా ముఖం కూడా చూడ్డం మానేసి, నామాటంటే కూరాకులో పురుగులా తీసేస్తూ, నన్నో చీడపురుగును విదిలించుకున్నట్లుగా కసిరికొట్టేవారు. చివరకు నే నెదురుగా కన్పిస్తే గొంగళీపురుగులా చూచేవారు నన్ను మా శ్రీవారు.

నేనెంతవరకూ మావారి స్థితిని దాచిపెట్టినా సెంటువాసనను లెక్కచెయ్యక దుర్గంధపు వాసన పైకొచ్చినట్టు మా వారి ప్రవర్తన పూర్తిగా మా మామగారు తెల్సుకున్నారు. నన్ను అడిగారు. కన్నీరే నా జవాబైంది. ఇంక మనస్సు ఉండబట్టలేక మామగారు ఓ రోజున మా శ్రీవారిని నిలబెట్టి అడిగారు— "సుబ్బలక్ష్మిలో ఏం లోటు వుంది అని నువ్వు ఇట్లా తిరస్కరిస్తున్నావ్?" అని తీవ్రంగా అడిగేసరికి వారు నిప్పులు త్రొక్కిన కోతిలా గంతులు వేస్తూ "ఇంక దానికీ నాకూ ఋణం తీరిపోయింది" అన్నారు.

మళ్ళీ అనేక విధాల చెప్పారు శ్రీవారికి తండ్రి. ఇట్లా కట్టుకున్న ఇల్లాలికి ద్రోహం చెయ్యడం చాలా అనర్థం అధర్మమని —

"నీ కోడలు బ్రతుకు నత్తగుల్ల లాంటిది. అట్లాగే అది బ్రతికున్నంతకాలం దాని పిల్లల్ని చూసుకొంటుంది కాని పురుగే చచ్చిపోయినప్పుడు గుల్ల కాలి క్రిందపడితే చాలా ప్రమాదకరం, ఇంకోసారి మళ్ళీ బిడ్డనుకని అది చస్తే ఆ పిల్లలు నా పీకకు త్రాచుపాముల్లా చుట్టుకుంటారు. కాబట్టి నీ సర్వస్వం నీ కోడలికి దాని బిడ్డలకీ యిచ్చి మీ బ్రతుకు మీరు

బ్రతకండి. నా త్రోవ నే చూచుకుంటా”నని రివ్వున ఇల్లువదలి వెళ్ళిపోయారు మా శ్రీవారు.

ముగ్గురు బిడ్డలతోనూ మా మామగారూ నేను మా శ్రీవారికోసం మూడు నెలలు ఎదురు చూశాం. కాని శ్రీవారు మళ్ళీ మా గుమ్మం తొక్కలేదు.

అల్లా యింటినుండి వెళ్ళిపోయిన మా శ్రీవారు ఒక హోటల్లో గది తీసుకు అందులో మకాం పెట్టారు. వచ్చేజీతం అయ్యేఖర్చుకి సరిపోయేది వారికి. సాయంకాలం టైములో వారికి బాగా తెల్సిన స్నేహితురాలు జగదాంబ అనే ఆమెతో కాలక్షేపం చేస్తుండేవారు.

ఓ రోజు ఆదివారం నాడు పదిగంటలకే మా శ్రీవారు భోంచెయ్యకుండా జగదాంబ యింటికెళ్ళి కబుర్లలో పడ్డారు ఇద్దరూ. జగదాంబగారు స్త్రీ స్వాతంత్ర్యాన్ని గురించి, సంఘంలో, సంసారాల్లో పురుషులవల్ల స్త్రీలకు జరిగే అన్యాయాలను గురించి పురుషుల దాస్యమునుంచి విముక్తి పొందటానికి స్త్రీలు విద్యావతులై స్వతంత్ర జీవనమున కలవాటు పడవలసిన ఆవశ్యకతనుగురించి, సంసారంలో ఆర్థిక యిబ్బందులకు స్త్రీలుకూడా ఉద్యోగం చెయ్యడం అవసరమని, బహుకళత్రం వల్ల కలిగే ఇబ్బందులు- ఇల్లాంటి విషయాలే ఎన్నో చెప్పుకొచ్చింది ఆవిడ.

మా శ్రీవారు మాత్రం ఆ జగదాంబ యందుగల మోహావేశంలో ఆవిడ మాట్లాడే తీరు, ఆమె ముఖం ఆమె పెదవులు ఆవిడను నఖశిఖపర్యంతం తన్వితీరా చూస్తూన్నాడేకాని ఆమె మాటలకు జవాబిచ్చే స్థితిలో లేరు శ్రీవారు.

“శ్రీనివాసూ: భోజనటైమ్‌కూడా దాటిపోతోంది. నువ్వు భోంచేసావా?” అనడిగింది జగదాంబగారు.

“ఊహూ! లేదు” అన్నారట మా శ్రీవారు భయంతో అదోరకమైన ఆదుర్దాతో, కలవరపాటుగా.

“సరే అయితే భోంచేద్దుగాని రా!” అంటూ ఆదరాభిమానముతో చెప్పింది, జగదాంబ.

తలుపువేసి లోపలికెళ్లారు మా శ్రీవారు. ఒంటరి పాటుగాయున్నా జగదాంబని చెయ్యి పట్టుకొన్నారు.

శ్రీనివాసు అప్రయత్నంగా అల్లా చెయ్యి పట్టుకోవడంతో నిశ్చేష్టురాలై నిలబడిపోయింది జగదాంబ.

“జగదాంబ, నువ్వు నన్ను ఏవిధంగా అనుకున్నాసరే, నీరూపం, నీయవ్వనం నన్నాకర్షించాయి. అందుకు తగినట్టే నువ్వు నాతో స్వతంత్రంగా ప్రేమ భావంతో మాట్లాడుతున్నావు. యీ విషయాన్ని నీకూ నాకూ తప్ప మూడోవ్యక్తికి తెలీదు” అంటూ ఆమె చేతుల్ని గట్టిగా పట్టుకున్నారు మా శ్రీవారు.

“ఛీ! ఛీ! నీచుడా! దౌర్భాగ్యుడా! స్త్రీల యొక్క విలువని గ్రహించే సహృదయుడవనుకున్నానే కాని ఈలాంటి దుర్మార్గుడవని నేను కలలోకూడా భావించలేదు. భార్యాబిడ్డలుకల సంసారివని చదువుకున్నవాడివని నిన్ను సోదరునిగా గౌరవించాను. ఒక అమాయకురాలైన ఇల్లాలిని ఒంటరిగా బలాత్కారించే ఛండాలుడవనుకోలేదు” అంటూ చెంపమీద ఛెళ్ళున వేడిగా వేసింది జగదాంబ మా శ్రీవారికి.

ఆదెబ్బతో మా శ్రీవారి ధైర్యం జారిపోయినా, మళ్ళీ గుండె దిట్టంచేసుకుని ఆవిడను ఎల్లాగైన అనుభవించాలనే తీవ్ర పట్టుదలతో తన యావశ్శక్తీ వినియోగించి జగదాంబను కౌగలించుకోబోయారు మా శ్రీవారు.

“ఛీ! నీచుడా! కొంచెం స్నేహంగా, చనువుగా యున్నంతమాత్రాన్న ఇల్లాంటిదురంతానికి పాల్పడతావని తెల్సుకోలేకపోయా. నీకు నేను తల్లివంటిదాన్ని సోదరివంటిదాన్నిరా! కుక్కను అందలమెక్కించినట్లు నిన్ను, నీవంటి పరమ నీచుల్ని గుమ్మంలోకి రానివ్వడం నాదే పొరపాటని తెల్సుకున్నా! పో, బయటికి నడు. నువ్వు నావైపు కన్నెత్తి చూశావంటే నీ బ్రతుకు సర్వనాశనం చేసి, నీలాంటి దుష్టుడు మరెవ్వరిజోలికీ రాకుండా నీ బ్రతుకే అఖరుచేస్తా. స్త్రీ మహాశక్తిస్వరూపిణి అని గుర్తుంచుకో. స్త్రీ తన భర్తముందు ఎంత అబలో, పరపురుషునియందు అంత మహాకాళికావతారం. జాగ్రత్త” అంటూ చింతనిప్పుల్లా మండే కళ్లతో, ఎర్రని రక్తవర్ణంతో యుండే ఆముఖం చండికావతారంలా అయిపోయింది కోపంతో జగదాంబ.

కళ్లుమూసుకుపోయిన కామాంధకారంతో ఒళ్లు తెలీని ఆవేశంలో “నీకు కావల్సినడబ్బు యిస్తా” నని జగదాంబను బలాత్కారంగా పట్టుకోబోయాడు. శ్రీనివాసు.

జగదాంబ తన మానసంరక్షణార్థం అక్కడే యున్న చేతికందిన రూళ్లకర్రతో శ్రీనివాసు నెత్తిమీద నాల్గు పెంట్లు మొత్తింది బలంగా. నిలువునా క్రింద బడ్డాడు.

"నీచుడా! పరమచండాలుడా స్త్రీల యొక్క మానాన్ని నీ తుచ్ఛమైన డబ్బుతో కొందామని అనుకొంటున్నావురా? అపాత్రుడా! స్త్రీకి తన ప్రాణం కంటే మానమే ప్రధానమని గుర్తించుకో. దౌర్భాగ్యుడా! నీ భార్య సుబ్బలక్ష్మికి వైధవ్యం తెచ్చిపెట్టడం ఇష్టంలేక, సాటి స్త్రీ కన్నీటిని చూడలేక నిన్ను ప్రాణాలతో ఒదులుతున్నా. ఓ శ్రీనివాసూ! ఏ స్త్రీనైనా మానభంగం చెయ్యడానికి మళ్లీజన్మలో ప్రయత్నించావా ఆ యిల్లాలు నీ ప్రాణాల్ని భయంకర సర్పమై కాటువేస్తుంది. ఛూ! ఛూ!" అంటూ ఖాండ్రించి ఉమ్మేసింది జగదాంబ శ్రీనివాసుమీద.

ఇన్ని మాటలన్నా మా శ్రీవారిని ఆవేశించిన కామదేవత వదలకపోవడంతో మళ్లీలేచి జగదాంబమీదకు విజృంభించాడు.

ఇంకా మళ్లీ శ్రీనివాసు తనను పట్టుకోవడంతో త్రోకతొక్కిన త్రాచులా, మహిషాసురమర్దనం నాటి జగదాంబవలె వీరావేశంతో విజృంభించి తలమీద రూళ్ళకర్రతో గబగబా మొత్తుతూంటే తలమీంచి, నుదుటిమీంచీ రక్తం కారుతూంటే క్రింద పడ్డాడు శ్రీనివాసు. క్రిందపడిన శ్రీనివాసుని కాళింగిమర్దనం త్రొక్కినట్లు కాళ్లతో ఫెడీ ఫెడీ తన్ని, చచ్చిన గొడ్డును లాగినట్లు శ్రీనివాసు రెండు చేతులూ పట్టుకుని బరబరా యీడ్చుకు వెడుతూంటే జగదాంబ రెండు కాళ్ళూ పట్టుకు "తల్లీ జగదాంబా! నన్ను క్షమించు, ఈ జన్మలో నేనెప్పుడూ పరస్త్రీని ముట్టుకోను." అంటూ శ్రీనివాసు జగదాంబ రెండు పాదాలు పట్టుకు "నన్ను రక్షించు" అన్నాడు నోటంట రక్తం కారుస్తూ.

జగదాంబ బాణందెబ్బతిన్న సింహంవలె అహంకారంతో శ్రీనివాసుని ఈడ్చుకెళ్లి వీధులో పారేసి "ఛండాలుడా! నన్ను బలాత్కరించబోవడం స్త్రీజాతికే అవమానం తెచ్చిన నీచుడా! నువ్వు చెయ్యబోయే పని, నీ తల్లిని, నీ సోదరిని, నీ కూతుర్ని, మహా పతివ్రతామతల్లుల్ని అందర్నీ బలాత్కరించబోయినట్లు గుర్తించుకో, నీ భార్య నేపురుషుడైనా నీవలె బలాత్కరిస్తే, నువ్వేంచెయ్యబోతావో; అల్లాగే నిన్ను ప్రాణాలతో యుండకుండా చంపేద్దామనుకొన్నా. కాని నీ భార్య అయిదోతనం కోసం నాపాటి ఆడదాని సౌభాగ్యంకోసం, నీ బిడ్డలు అనాథులు అవకుండా యుండేందుకే నిన్ను వదిలేశా. శ్రీనివాసూ! ఈనాడు నువ్వు నాచేతిలో చావకుండా బ్రతికావంటే అది నీభార్య మాంగళ్యసూత్రప్రభావం అని తెల్సుకో. ఈ భారతదేశంలో నీతికి, నిజాయితీకి నిలబడే పతివ్రతలు అన్నికాలాల్లోనూ కూడా యుంటారనే సంగతి మర్చిపోకు. ఫో! నువ్వు మళ్లీ నా గుమ్మం ఎక్కావా? ప్రాణాలతో తిరిగి వెళ్ళవు పాపాత్ముడా!" అంటూ తుబుక్కున ఉమ్మేసి లోపలికి వెళ్లి తలుపేసుకుంది జగదాంబ.

శ్రీనివాసు ఆ వీధిలో అల్లాగే స్పృహతప్పి పడిపోయాడు. అలా ఎంతసేపు స్మారకం లేకుండా పడియున్నాడో తెలీదు కాని, అంతలో వీధంట పోయే కాలేజీ స్టూడెంట్సు మా శ్రీవారినిచూచి దగ్గర కొచ్చారు. తలమీద బలమైన దెబ్బలు, నుదురుమీద పెద్దగాయంపడి రక్తంకారుతోంది. నోటంటకూడా నురుగులు వస్తూన్నాయి. ఆ స్థితిలో వున్నా శ్రీనివాసుని బండిమీద పడుకోబెట్టి హాస్పత్రికి తీసుకుపోయారు ఆ స్టూడెంట్సు. డాక్టరు వెంటనే ఇంజక్షన్లు చేసిన కొంతసేపటికి స్పృహ వచ్చింది శ్రీనివాసుకు.

"ఇంత ప్రాణాపాయమైన దెబ్బ లెందుకు తగిలాయి?" అని డాక్టర్ అడిగాడు. "సైకిల్ మీద నుంచి రాళ్లగుట్టమీద పడ్డా" గౌరవానికి భంగం రాకుండా అబద్ధం చెప్పారు మా శ్రీవారు.

ఈ సంఘటనతో మా శ్రీవారు పూర్తిగా మారిపోయారు. వారిలో చాలా పరివర్తనకలిగి పశ్చాత్తాపంతో కుమిలిపోయారు. జగదాంబగారిమాటలు వారి చెవుల్లో, వారి హృదయంలో గింగురుమంటూ మ్రోగుతున్నాయి. శ్రీవారు మా కోసం కబురు చేసారు. ఈవార్తవినేసరికి నేను, పిల్లలు, మా మామగారు, వెంటనే హాస్పత్రికి వెళ్లాం. శ్రీవారిని, వారి స్థితిని చూచేసరికి నేను, వారి తండ్రికూడా ఆపుకోలేనంత దుఃఖించాం. డాక్టరువచ్చి "ప్రాణభయం లేదు" అని చల్లని కబురు చెప్పారు. మా శ్రీవారు నన్ను దగ్గరగా రమ్మని పిల్చారు. కన్నీటితో నా రెండు చేతులూ పట్టుకున్నారు. "అల్లా భయపడకండి, ఏమీ పర్వాలేదు తగ్గిపోతుంది" అన్నా.

ముగ్గురి పిల్లల్ని దగ్గరకు తీసుకుని ప్రేమతో వాళ్ళను ముద్దెట్టుకున్నారు శ్రీవారు. ఇన్నాళ్లకు బిడ్డలని స్మరించి చేరదీసినందుకు ఆశ్చర్యపోయాం మేము.

"సుబ్బలక్ష్మీ! కన్నుమిన్నూ కానకుండా నీ పవిత్ర హృదయాన్ని నొప్పించా. కాళ్లదగ్గరున్నా అమృతాన్ని వదులుకుని హాలాహలానికి ఎగబడ్డా

ఇన్నాళ్లూ. ఈ పాపిని క్షమించవూ ?" అంటూ పశ్చాత్తాపంతో వలవలా ఏడ్చారు శ్రీవారు.

ఇన్నాళ్లకు ఆ లోకమాత జగదాంబ పరిపూర్ణానుగ్రహంవల్ల మా శ్రీవారి మనస్సు మారినందుకు చాలా ఆనందించా.

"నాన్నా! కన్న తల్లితండ్రులకీ, కట్టుకున్న ఇల్లాలికీ, కడుపున పుట్టిన బిడ్డలకీ అన్యాయంచేసిన అప్రాచ్యుణ్ణి నన్ను క్షమించరూ" అంటూ తండ్రిని వేడుకున్నారు భోరున ఏడుస్తూ మా శ్రీవారు.

జగదాంబ కొట్టిన దెబ్బతో మా శ్రీవారికి జ్ఞానోదయమైంది. ఆనాటినుంచీ వారి తండ్రిని, నన్ను, పిల్లల్ని, నిష్కల్మషమైన ప్రేమతో, సంపూర్ణంగా ప్రేమిస్తున్నారు మా శ్రీవారు. నెలరోజులకి గాయం పూర్తిగా తగ్గి రూపాయకాసంత మచ్చ నుదుటిమీద శాశ్వతంగా నిల్చిపోయింది జగదాంబ పేరుతో.

ఈ పదిసంవత్సరాలనుంచీ మళ్లీ మా శ్రీవారు పరస్త్రీ ముఖం కన్నెత్తికూడ చూడలేదంటే అతిశయోక్తి అనిమాత్రం అనుకోవద్దు "ఏనాడైతే నేను ఆ జగదాంబచేత దెబ్బతిన్నానో, ఆనాటినుంచే నా నిజమైన జీవితంలో తృప్తిగా మనశ్శాంతిగా ఆనందంగా యుండగల్గుతున్నా"ననీ, నేటికీ అంటూంటారు మా శ్రీవారు.-అంటూ శ్రీనివాసుగారి ముఖం మీద ఆమచ్చ ఏమిటీ అని అడిగిన తనస్నేహితురాలికి చెప్పింది సుబ్బలక్ష్మి.

---

# విరికన్నె నిరీక్షణ

శ్రీ శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి

రంగురంగుల మృదు దుకూలముల దాల్చి
దిశలకెల్ల నామోద సందేశమంపి
అంతరంగమ్ము మధుర స్రవంతిజేసి
ఏ ప్రియునిరాకకై నిరీక్షింతువీవు!

స్వచ్ఛహిమబిందు సంతతిన్ స్నానమాడి
ప్రవిమలదళాల మడుగు జీరను ధరించి
భ్రమర రవముల భక్తిగీతములు పాడి
ఏ విభుని పూజకై నిరీక్షింతువీవు ?

అరవిరియు రేకులను సిగ్గుసిరులు నింపి
ముగ్ధమోహన తరుణిమ మూటగట్టి
మలయపవను సంస్పర్శచే పులకరించి
ఏ వరుని పొందుకై నిరీక్షింతువీవు ?

కోమల శరీరమున సూదిగ్రుచ్చనిచ్చి
యువతులు బిగించు దారంపుటురుల జిక్కి
చెలుల దృఢ పరిష్వంగాల నలిగిపోయి
ఏసుగతి సిద్ధికై నిరీక్షింతువీవు ?

త్రెంచి ధరియించు జనులకు తృప్తినిచ్చి
గుండె వ్రీలగ నత్తరుల్ పిండనిచ్చి
పరుల ఆనందమునకు సర్వస్వమిచ్చి
ఏ సుఖప్రాప్తికై నిరీక్షింతువీవు ?

ఏకాంకిక

# వెలుగు - నీడలు

(గతసంచిక తరువాయి)

ఆనంద్:- (కోపంతో) తరువాత ఏం జరిగింది!

కామేశం:- మీకు చెల్లెళ్ళు లేరా! మీ చెల్లెళ్ళను ఎవరైనా అవమానం చేస్తుంటే చూస్తూ వూరుకుంటారా! అన్నాను పెద్ద హీరోలా ఫోజుపెట్టి. నీకెందుకు నోరుమూసుకుని అవతలకుపో అన్నారు. నాకు వీరావేశం పుట్టుకొచ్చింది. వాళ్ళలో ఒకడి వీపుమీద నెమ్మదిగా అంటించాను. వాళ్ళు నిజంగా నను కొని నావీపు బ్రద్దలు కొట్టారు. ఇది నాటకంరాబాబూ అని ఆ అమ్మాయికి వినపడకుండా వాళ్ళను బ్రతిమాలాను, తరువాత వాళ్ళను కొట్టినట్లు నటించాను. తరువాత వాళ్ళు పారిపోయారు. ఆమె దగ్గరకు వెళ్ళి పారిపోయారు మేడమ్ అన్నాను. మీరు చెప్పనక్కరలేదు. కంటికి కనిపిస్తూనేవుందిగా అందిరా! వాళ్ళన్న మాటకు మీరు బాధపడకండి మేడం అన్నానురా!

ఆనంద్:- ఆ భారతమంతా నాకక్కర్లేదు నీవు వ్రాసిన వుత్తరానికి సమాధానం తీసుకువచ్చావా!

కామేశం:- పూర్తిగా చెప్పనివ్వరా! Madam, మిమ్మల్ని మనసారా ప్రేమిస్తున్నాను. మీరు నామీద దయచూపించాలి లేకపోతే మీపాదాల దగ్గరే నాప్రాణం వదలిపెట్తాను. మీరుమాత్రం అభయం యిస్తేనేగాని మీ పాదాలు వదలనని ఆమె పాదాలమీదపడి శరణు వేడుకున్నానురా! లేవండి ఆ పనిమాత్రం చెయ్యకండి! ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు! అందిరా! ఆ ఒక్క మాట చాలదూ! నామీద ఆమెకు ఎంత అనురాగముందో చెప్పడానికి! నాహృదయంలోని భావాలన్ని చెప్పడానికి నాకు ధైర్యం చాలడంలేదు. ఇది చదువుకోండి. అన్నీ మీకే అర్థమౌతాయి. నాకు ఏసంగతి వెంటనే వుత్తరంవ్రాసి నాకందేటట్లు పంపాలి. యీ దాసుడు మీదగ్గరినుండి వచ్చే ప్రేమలేఖకు యిచ్చటనే కాచుకొని కూర్చొని వుంటాడు! అని చేతి కందించాను — ఒక పావుగంట కూర్చున్నాను.

ఆనంద్:- తిరిగి సమాధానం వచ్చిందా! లేక చెప్పు దెబ్బ లేమైనా సాక్షాత్కరించాయా! త్వరగా సెలవియ్యరా up-to-date Romio.

కామేశం:- ఆగరా! కొంచెం గాలిపీల్చుకోనియ్యరా! అలా పావుగంట కూర్చున్నాను. ఒక చిన్న కాగితం చిన్న రాయికికట్టబడి వచ్చి నాముందుపడిందిరా!

ఆనంద్:- ఏదీ! ఆ వుత్తరం చదువు.

కామేశం:- నా ప్రియురాలు వ్రాసిన వుత్తరం బయటకు చదవడానికి నాకు మనస్సంగీకరించడంలేదు. నువ్వే చదవరా విని ఆనందిస్తాను.

(అని ఆనంద్ చేతికందిస్తాడు)

(ఆనంద్ వుత్తరం చదవటం ప్రారంభిస్తాడు)

ఆనంద్:- మిష్టర్ లేఖ నాకందింది. మీ మనస్సులోని కోర్కలను అర్థంచేసుకున్నాను. మీరు ఎంత కాలంనుండి యీ విధంగా బాధపడుతున్నారో నాకు తెలియలేదు. ఎందుచేతనంటే మీ కున్న విశాల భావాలు నాకు లేవుకదండి! అందుకనే నేను చాల విచారిస్తున్నాను. మీరు వ్రాసిన లేఖద్వారా అర్థంచేసుకున్నాను. నేను మిమ్మల్ని మనసారా ప్రేమించాను. ఈ ప్రపంచంలో మిమ్మల్ని తప్ప మరెవ్వరినీ వివాహంచేసుకోను. మీవంటి మహాత్ముడు యీ ముల్లోకాలలోనూ నాకు ఎక్కడా దొరకడు. అని నేనంటానని మీరనుకుంటారేమో. నీవంటి నీచుణ్ణి ముక్కలుగా కోసినా పాపంలేదు.

కామేశం:- అమ్మ బాబోయ్!

ఆనంద్:- ఇంకావిను. ఆ రౌడి వెధవలను మీకు అక్క చెల్లెళ్ళు లేరా అని దబాయించినప్పుడున్న ఆ జ్ఞానంనీలో లేకపోయిందే. ఒక స్త్రీని చూడగానే కుక్కకన్నా హీనంగా తయారయ్యేవాళ్లకు చక్కని గుణపాఠం నేర్పిస్తాను. ఈ రోజున నీవు వ్రాసిన వుత్తరం ప్రిన్సుపాల్ గారి ఎదుట పెట్తాను. మా అన్నయ్య ఆనంద్‌తో చెప్పి నీపని పట్టిస్తాను.

కామేశం:- నువ్వుగాక యింకా ఆనంద్ గాడెవడ్రా!

ఆనంద్:- నేనుగాక మరెవ్వరో కాదు. ఆ ఆనంద్‌ని నేనే. నీకు ఆ అమ్మాయి చేత గట్టిగా బుద్ధిచెప్పిద్దామనుకున్నాను. ఆ అమ్మాయి అందుకు సాహసించలేకపోయింది.

కామేశం:-మరి వీడి బెజవాడని చెప్పావుగదరా !

ఆనంద్:-ఆ అమ్మాయి మా పినతండ్రి కూతురు. నీలాంటి నీచుల్ని ముక్కలుగా నరికినా పాపం లేదు. ఆ ఫోటో నీకు ఎలావచ్చింది.

కామేశం:-క్షమించరా ఆనంద్! ఫోటో స్టుడియోకి వెళ్ళాను. అచ్చట కనిపించింది. ఎవరూ చూడకుండా జేబులో పెట్టేశాను. ఆనంద్ క్షమించరా! నీ కాళ్ళు పట్టుకుంటాను. ఇటువంటి పనులు యింకెప్పుడూ చెయ్యనురా. ఈ వక్కసారి నన్ను క్షమించరా!

ఆనంద్:-యింకెప్పుడైనా యీవిధంగా ప్రవర్తిస్తే ఏంచెయ్యమంటావ్!

కామేశం:-నీ యెడంకాలు చెప్పతీసుకుని వాయించు-పడతాను.

ఆనంద్:-ఈరోజున నీ అదృష్టం బాగుండిపోయింది.

(చాలా సంతోషముగా విశ్వం; వెనుక కంగారుగా కాలాంతకరావు ప్రవేశిస్తారు)

ఆనంద్:-ఏమిటి బ్రదర్ సంగతి.

కాలం:-(కంగారుగా) ఏంపనిచేసావ్ విశ్వం. విచారంలో వున్నావుకదా, మనస్సుకు కొంత విశ్రాంతి కలుగుతుందనే వుద్దేశ్యంతో తీసుకువెళ్ళితే!

ఆనంద్:-ఏం జరిగిందిరా !

విశ్వం:-ఈరోజున నాకు చాలా ఆనందంగావుంది,

కామేశం:-వీడి మతి పూర్తిగా స్థానం తప్పింది.

విశ్వం:-నాకేం మతి పోలేదు. కనీసం ఒక అభాగ్యురాలి జీవితాన్నయినా బాగుచెయ్యగలనేమో నన్న ధైర్యంతో నేనాపని చేసాను.

ఆనంద్:-ఏమిట్రా ఆ ఘనకార్యం! యుద్ధంలో జయంకల్గిన సోల్జరులా మొహం నవ్వావు.

కాలం:-ఆ! చాలా ఘనకార్యం చేశానని వీడనుకుంటున్నాడు. వీడిలో ఏమాత్రం జ్ఞానమున్నా ఆపని చెయ్యడు.

ఆనంద్:-ఏంచేశాడురా ?

కాలం:-ఏముంది ఒక బజారు వ్యక్తిని, ఒక వ్యభిచారిణి, పతితను వివాహం చేసుకుంటానని మాటిచ్చాడు. యింతకంటే యేంకావాలి.

కామేశం:-రామరామ పాపం శమించుగాక!

విశ్వం:-ఆమె వ్యభిచారిణి, కులట, బజారు రకమని వివిధ రకాలైన పేర్లు మాత్రమే నేర్చుకున్నారు. కాని ఆమె ఆవిధంగా మారటానికి గల కారణాలు, మీలో ఎవరైనా చెప్పగలరా. అవును ప్రస్తుతం మీ దృష్టిలో ఆమె వ్యభిచారిణిగానే కన్పిస్తుంది. మీ దృష్టిలోనే కాదు. ఆమె ముఖం చూసిన ప్రతివారి దృష్టిలోనూ అదే విధంగా కన్పించవచ్చు.

కామేశం:-వీడి దృష్టిలో సీత, అనసూయ, సావిత్రి లాంటి మహా పతివ్రతలా కన్పించివుంటుందిరా.

ఆనంద్:-ఒకేయ్ కాలం. నీతో బయలుదేరాడనగానే నే నూహించుకున్నాను. మనవాడు ఏదో అవాంతరం తెచ్చిపెడ్తాడని. అనుకున్న ప్రకారం అక్షరాలా ఆచరించాడన్నమాట.

విశ్వం:-మీ రనుకున్నట్లే ఆచరించివుండవచ్చు. ఆమెను గురించి ఏమాత్రం తెలిసివున్నా మీరిట్లా మాట్లాడరు.

ఆనంద్:-వెళ్ళిన అయిదు నిముషాల వ్యవధిలో ఆమెనుగూర్చి వీడు పూర్తిగా తెలిసికున్నాడు.

విశ్వం:-ఆమెది మన వూరేరా ఆనంద్. మనరంగయ్య కూతురు జానకి.

ఆనంద్:-ఆఁ !

విశ్వం:-రంగయ్య చనిపోయిన ఆరు మాసాలలోనే కాంతమ్మకూడా చనిపోయింది. బ్రతకడానికి చిల్లిగవ్వకూడ ఆమె చేతిలో లేకపోయింది. మన వూళ్ళో సుందర్రావుగారింట్లో పనిమనిషిగా కుదిరిందట. యౌవ్వనంలో వున్న జానకిని అతడు ఆశించాడు. ఆమె నిరాకరించింది. ఆ రాత్రి జానకి వుంటున్న గుడిసె తగులబెట్టించాడు. ఇక వూళ్ళో జీవించడం కష్టమని, ఏ ఫ్యాక్టరీలోనైనా పనిచేసుకొని బ్రతకవచ్చునని మద్రాసు చేరింది. ఒక విలాస పురుషుడు ఆమెను చేరదీశాడు. కొంతకాలంపాటు కామంతీర్చే యంత్రంలా వాడుకున్నాడు. తరువాత ఆమెమీద మమకారం తగ్గింది. అదృశ్యుడైనాడు. సముద్రంలో దూకి చచ్చిపోదామని బయలుదేరింది. ఒక అపరిచితురాలు ఆమెను ఆదరించినట్లు నటించింది. ఆమెను నమ్మింది. యింటికి తీసుకవెళ్ళి ఆమె మనస్సును మార్చింది. పడుపు వృత్తి ప్రారంభించమంది. అప్పటి పరిస్థితులలో ఆమెకు అంతకంటె గత్యంతరము కన్పించలేదు.

కామేశం:-కందుకూరి వీరేశలింగం పంతులుగారు వితంతు వివాహాలను ఎలా ఆచరణలో పెట్టించాలని అంత కృషిచేసారో అలాగే మనవాడు పతితల వివాహమని క్రొత్త విధానాన్ని ప్రవేశపెడుతున్నాడు.

విశ్వం:_పతితల వివాహం కాదురా, ఆమె విషాద గాథ విన్న తరువాత నా హృదయంలో ఆమెను ఆదరించాలనే భావం కలిగింది. మల్లెలు విరియగానే పరిమళాన్ని వెదజల్లుతాయి. మనం ఆస్వాదిస్తాము. యౌవ్వనంలో వున్న ప్రతి యువకుడు ఆమెను ఆశిస్తాడు. ఒక యంత్రంలా వాడుకుంటాడు. కొంతకాలానికి ఆమెలో వున్న కళాకాంతులు నశిస్తాయి. ఒక చీడపురుగుకన్నా హీనంగా చూస్తారు. అటువంటి స్త్రీని ఆదరించి వివాహం చేసుకోవడంలో తప్పేముంది. ఒక అభాగ్యురాలిని ఆదరించానన్న గౌరవం నాకు దక్కుతుంది.

కాలం:_ఒక పతితను వివాహం చేసుకున్నావని సంఘం నిన్ను వెలివేస్తుంది. మీ నాన్న నిన్ను చేరనివ్వడు. తన ఆస్తిలో ఒక్క కానీకూడ నీకు దక్కనివ్వడు.

విశ్వం:_కాలం, అంతమాత్రానికి భయపడితే ఎలా. ఏదైనా వుద్యోగంకోసం ప్రయత్నంచేస్తాను. వుద్యోగం దొరక్కపోతే కష్టపడటానికి కావలసినంత శరీరముంది. కూలిచేసుకొనైన ఆమెను పోషించగలను. నిగురుగప్పిన నా జీవితానికి జానకి నూతన కాంతిని ప్రసాదించింది. ఆమెనే వివాహం చేసుకుంటాను-నమస్తే వస్తాను.

కాలం:-బ్రదర్, యీ విశాల విశ్వంలో నేను నీవు పరమాణువులం. సంఘంలో వుండే అన్యాయాలను అరికట్టాలంటే చాలకష్టం. పతితను వివాహం చేసుకున్నావని చీడపురుగుకన్నా హీనంగా చూస్తుంది లోకం. సంఘానికి ఎదురు తిరిగి నీ ఆశయాలనుండి విఫలుడవౌతావేకాని ప్రయోజనమేమీ కనుపించదు. ప్రతి మానవుడిలోను ఆశలు, ఆశయాలు అపారంగా వుంటాయ్, వాటిలో అసాధ్యమైనవి చాల వుంటాయ్, వాటిని ఆచరణలో పెట్టాలంటే చాల యుగాలు పడుతుంది. నీ వక్కడివే సంఘాన్ని సరిదిద్దాలని నడుంకట్టినందువల్ల ఏమీ ప్రయోజనముండదని నా అభిప్రాయం.

విశ్వం:-కాలం. నన్నలా అధైర్యపరచకు. జానకీ నేనూ శరీరంలో చివరి రక్తబిందువువరకూ కష్టపడి పనిచేస్తాం.

కాలం:_నీ స్వార్థంతో సంఘాన్ని మార్చడానికి ప్రయత్నం చేస్తున్నావంటుంది లోకం. నీవక్కడివే ఆచరించడమనేది అసాధ్యం. సంఘాన్ని మరమ్మత్తు చేసేముందు కొంతమంది చీడపురుగులను కనిపెట్టి వారి బ్రతుకులను నడివీధిలో పెట్టాలి. సంఘమనే యినుపకవచాన్ని ధరించి వారు చేస్తున్న పైశాచిక కృత్యాలను పదిమందికి వెల్లడిచేయాలి. సంఘ సంస్కర్తగా కావాలని ప్రతిమానవుడు ఆసిస్తాడు. నీ వామెను ఆదరించి వివాహము చేసుకొని నీ జీవితాన్ని సస్యశ్యామలంగా చేసుకుందా మనుకుంటున్నావు. ఆశయం మంచిదే.

విశ్వ:_కాల ప్రవాహానికి ఎదురీది నా ఆశయాలను నెరవేర్చుకుంటాను. అడ్డంవచ్చినవాళ్ళను హాత మార్చడానికికూడ వెనుకంజవేయను. నా జీవిత లక్ష్యాన్ని సాధిస్తాను.

కాలం:-జీవితలక్ష్యం. ఏమిటి నీ జీవితలక్ష్యం. పది రోజులముందు నీ జీవితలక్ష్యం ఏమిటి. ప్రేమించిన నీ మాధురిని వివాహం చేసుకోవడంవరకే. దారి మారింది. పరిస్థితులన్నీ తలక్రిందులుగా మారాయి. ఆ పరిస్థితులలో నీ జీవితలక్ష్యం కూడా మారిపోయింది.

విశ్వం:_యింతకాలం లోకాన్ని అర్థంచేసుకోలేని అంధుడనైనాను. యీనాటికైనా లోకం లోతులను తెలిసికున్నాను.

కాలం:_నీకున్న లోతులు చాల స్వల్పమైనవి. యీ ప్రపంచములో ఎంతోమందిని చూశాను. అనేక అనుభూతులను పొందాను. నీ జీవితంలో ఒక్క జానకి జీవితాన్నే చూశావు. కామతృష్ణ అంటువ్యాధికన్నా చాల తీవ్రమైనది. ఎటువంటి మానవుడినైనా బానిసను చేస్తుంది. జానకి తిండిలేక పొట్ట పోషించుకోడానికి వేరుమార్గం లేక ఆవిధంగా చేసింది. వయస్సులో వున్న యువతులను ఆదరించడానికి చాలమంది సంస్కర్తలు బయలుదేరుతారు. కాని వాళ్ళనుచూసి లోకం నిజంగా సంస్కర్తలనే అనుకుంటుంది. వాళ్లు కట్టేవరకె కన్పడే కాల సర్పాలని తెలిసికోలేదా లోకం. తెరమరుగున ఎంతమంది మానవతుల పవిత్ర శీలాలు మంటకలిసి పోతున్నాయో చూడలేక నా కళ్లు రక్తాశ్రువులను రాల్చినయ్!

విశ్వం:_కాలం యీ విశాల విశ్వంలో ఎక్కడైనా తలదాచుకోగలం. ఏ మహానుభావుడయినా కనికరించి వుద్యోగం యిస్తాడు.

కాలం:_నీకా ధైర్యముంటే నీకు భగవంతుడే సహాయము చేస్తాడు. మానవ ప్రయత్నానికి దైవకృప వుండాలి.

ఆనంద్:_పతిత జనోద్ధరణకు అవతరించిన పరమ పురుషుడు. వాడు చేసే అక్రమాలకు వీడు దోహదం యిస్తున్నాడు. ఒక బజారు రకాన్ని చేరదీసి, దాన్ని వివాహంచేసుకోమని ప్రోత్సహిస్తున్నాడే దేశభక్తుడు. మానవులకు నీతి నిజాయితీ లవసరం.

కాలం:_ఏమిటి ఆనంద్ నీవు మాట్లాడుతున్నావా? యింత ధైర్యం నీకు ఎలావచ్చింది.

ఆనంద్:_ధైర్యం రావడ మేమిటి? యదార్థమే మాట్లాడుతున్నాను.

కాలం:_నీలో యదార్థమనే పదార్థం కోసిచూసినా కన్పించదే.

ఆనంద్:_ఏం?

కాలం:_నీకు ఆశ్చర్యాన్నే కలుగజేస్తాయి. అవును నువ్వు కులం, ఆస్థి, అంతస్థు, గౌరవం, పేరు ప్రతిష్టలు అన్నీవున్న ఒక సౌందర్యరాశిని ప్రేమించావుగా! అందువల్ల 25 వేల రూపాయలు వస్తాయి. ఒక అందమయిన అమ్మాయి లభిస్తుంది.

ఆనంద్:_నా జలజకు ధనం లేకపోయినా, ఆస్తిలేకపోయినా ఆమెనే వివాహం చేసుకునేవాడిని. నాకు కావలసింది ధనంకాదు. పవిత్రత. ఆమెలోవున్న గుణాలు నన్నాకర్షించాయి.

కాలం:_నిన్నాకర్షించింది ఆమెయొక్క ధనం, ఆమె అంతస్థు, ఆమె పరులకు చూపించే వయ్యారం మాత్రమే. ఆమె అర్ధణామందాన్ని కోటింగు కొట్టుకొనే ముఖం. నిన్నాకర్షించింది. కాని ఆమె శీలం మట్టుకు కాదు.

ఆనంద్:-కాలం వళ్లుతెలిసే మాట్లాడుతున్నావా!

కాలం:_అవును బ్రదర్. నీలాంటి పరమమిత్రులు గాఢాంధకారాన్ని పున్నమినాటి వెన్నెలగా భ్రమిస్తున్నారు. పాలుపోసిన పామును, తేనె పూసిన కత్తులను తెలిసికోలేకపోతున్నారు. తెల్లని వన్ని పాలు, నల్లనివన్ని నీళ్లు అని భ్రమించే స్వభావం నీది.

ఆనంద్:_ఆ చెప్పేదేదో సరిగ్గా చెప్పు.

కాలం:_అవకాశం వచ్చింది సద్వినియోగం చేసికోకుండా వదుల్తానా! భగవంతుడు ప్రపంచంలో వుండే అందాలన్నీ జలజరూపములో పొదిగి నీవంటి సలీమ్‌గార్కి అర్పించినట్టుభావిస్తున్నావ్! చేతులు కాలినతరువాత ఆకులు పట్టకుండా ముందుగా జాగ్రత్తపడడం మంచిది.

ఆనంద్:-అయితే నీకు మా జలజ తెలుసునా?

కాలం:-చాల బాగా తెలుసు!

ఆనంద్:_నీకామె ఎప్పటినుండి తెలుసు.

కాలం:_నీ వామెను ప్రేమించావని, వివాహంచేసుకోబోతున్నావని తెలిసినప్పటినుండి.

ఆనంద్:_అంటే.

కాలం:_నీలాంటి సంఘ సంస్కర్తలు ఎంత నిజాయితీగా నిలబడతారా అని_తెలుసుకుందామని.

ఆనంద్.-దానివల్ల నీకు వచ్చే లాభమేమిటి?

కాలం:_అన్యాయాల్ని అక్రమాలను చేతనయినంత వరకూ అణచివేయడం. మీవంటివాళ్ళను ఆదర్శ జీవులనుకొని వెనుక తరంవాళ్ళు చెడిపోకుండా కాపాడ్డం.

ఆనంద్:-మేమేం అన్యాయాలను చేశామని నిరూపించగలవు.

కాలం:_ఆధారాలకు ప్రత్యేకంగా వెదుకనక్కర లేదు. యిది చూడు. (జేబులోనుండి పర్సుతీసి అందులో ఫొటో ప్రకటిస్తాడు).

ఆనంద్:_(చూసి) ఆ!

కామేశం:-(చూసి) అమ్మబాబోయ్!

కాలం:-అంతలోనే కంగారెందుకు ఆమెకు నువ్వొక్కడవే భర్త వనుకున్నావా! ధనం, ఆస్థి, మేడలు, మిద్దెలు వుండగానే సరిపోతుందా!
వీరందరూ పవిత్రభారత మహిళలు. స్త్రీజాతికి వన్నెతెచ్చే ఆదర్శజీవులు. నీకు కులదైవం.

ఆనంద్:_కాలం,

కాలం:-అవును ఆనంద్ ధనానికి నీవు ప్రణయానికి మరి వకరు. నీవల్ల ఆమెకు కావలసినంత ధనం వస్తుంది. అతనివల్ల ఆమెకు వాంఛలు తీరుతాయ్. ఆమెలో తారతమ్యాలనే మచ్చుకోసినా కన్పించవు. ఆ కుమార్ ఆమె పినతల్లి కుమారుడు.

ఆమెకు కావలసింది కామవాంఛ తీరడం మాత్రమే. కాము కక్కుర్తిలో కళ్లుమూసుకుని మానవత్వాన్ని మరచి పశువుకన్నా హీనాతి హీనమైన ఘోరకృత్యాలు చేస్తూవుంటారు.

ఆనంద్:- నా జీవితాన్ని నాశనంచేసిన పాతకి. దాని ప్రాణాలు తీస్తాను. వంచకి.

కాలం:_ కూనీనేరం నీ నెత్తినవేసి మూసేస్తారు. యీ పయోముఖ విషకుంభాలను తెలుసుకుని ప్రవర్తించాలి. ఆ జారిణికి చక్కని గుణపాఠం నేర్పాలి.

ఆనంద్:_ నా అంధకారాన్ని పారద్రోలి నూతన కాంతుల్ని ప్రసాదించావ్!

కాలం:_ యిప్పటికైనా మించిపోయిందేమీ లేదు. కులం, మతం, అనే పేరిట జరుగుతున్న పైశాచిక కృత్యాలను తెలిసికొని మీ జీవితాలను సరిదిద్దుకోండి. (విశ్వంవైపు తిరిగి) నీవు జానకినే వివాహం చేసుకొని ఆదర్శజీవి ననిపించుకో. భారతజాతిని పునరుద్ధరించిన, భారతజాతికి పట్టిన చీడపురుగులను శాంతి అనే తేజస్సుతో పారద్రోలిన శ్రీ బాపూజీ పవిత్ర ఆశయాలను పాటించు. పవిత్ర భారతమాత అల్లారుముద్దుబిడ్డడ వనిపించుకుని వెలలేని మాణిక్యంగా ప్రకాశించు. నీ ఆశయసిద్ధి నెరవేర్పుకో వెళ్ళు.

విశ్వం:_ (వెళతాడు). (అందరు చూస్తుంటారు).

(తెర)





# విధివశం

శ్రీ ఆరాధ్యుల

చరచరా నడుస్తూ, సురసురలాడుతూ యింట్లోకి వస్తున్న నీలకంఠంగారి కోటు విప్పబోయింది శ్రీమతి. అంతలోనే 'హూ' అంటూ బుసకొట్టి విదిలించాడు.

''ఏమిటండీ యింతకోపకగా ఉన్నారు?'' అంది శ్రీమతి.

''హు కోపం! ఇంతకీ నీవు కదా చెడగొట్టింది వాణ్ణి. కొప్పడుతున్నప్పుడల్లా ప్రతిదానికి నీవు వాడిని వెనక వేసుకొచ్చావ్. నీ అలుసు తీసుకొనేగా వాడు ఆడింది ఆట పాడింది పాట అయింది.''

''ఎవరండీ యింతకీ?''

''ఎవరా! నీ సు..సు. పు...త్రు...డు.''

''ఏమి చేశాడు? ప్రతిదానికి వాడిమీద విసురుకు పడతారు.''

''అలా అనీ కాదు వాణ్ణి యీదారికి తీసుకొచ్చింది.''

''ఇంతకీ ఏమి చేశాడండీ?'!

ఏమిచేశాడా? హు! ఏదైనా చేస్తాడు. ప్రే... మ...ట! ప్రే . మ...! వయసొచ్చిన ప్రతివాడికి యిదొక ఊత పదమైంది. ఓ అమ్మాయిని ప్రేమించాడట. ఇదేనా వీడు కాలేజీలో చదివే చదువు. ప్రేయసితో సరససల్లాపాలు చేయటానికేనా సంవత్సరానికి వెయ్యిరూపాయలు దగ్ధం చేస్తున్నాడు. ఇదేనా వీడి చదువు యొక్క ఫలితం. మనవాడు పెద్దచదువరి యని విర్రవీగావే, చూడు నీ సుపుత్రుని చదువు'' అంటూ చేతిలోని ఉత్తరాన్ని శ్రీమతిముందు గిరాటు వేశాడు కోపంతో.

ఆతని మాటలు ఆమెను చిరాకు కలిగించాయ్. క్రిందపడిన ఉత్తరాన్ని ఆమె చదువ నారంభించింది.

''ప్రియ వసూ!

ఇచట ప్రతిక్షణము ఒక యుగంగా ఉంది. మన జీవితాలు అంధకార బంధురమవుతుందనుకున్నాను. కాని మన పెళ్ళికి శుభ కాంక్ష తెల్పింది మా అమ్మ. ఇక నీదే ఆలస్యం. నీవు పంపే శుభ వార్తకు అర్రులు చాస్తున్నది నా మనస్సు. మన ప్రేమలు నీటి బుడగలు కావని విశ్వసిస్తున్నాను, మీ వాగ్దాన నిర్వహణలో నిమగ్నులవుతారని ఆశిస్తున్నాను.

ఇట్లు
నీ సుజాత.''

అంతా చదివిన తర్వాత నిర్ఘాంతపోయింది. ఆమె మనస్సు వ్యాకులత చెందింది.

''ఆ!.. ఇంతకీ మనవాడే నంటారా!'' అంది శ్రీమతి.

''అనేందేంటి. చదివావుగా. వాడింత భ్రష్టుడవటానికి కారణం నీవు. వాడు లక్షాధికారి అవుతాడని ఆశించాను. ఆ అమ్మాయి నిక్షేపంలాంటి పిల్ల. నేనింత ఉచ్ఛస్థితికి రావటానికి వాళ్ళ నాన్నే కారణం. చనిపోయేటప్పుడు నా చేతిలో

చేయివేసి వాళ్ళ అమ్మాయిని మన వాసుకి పెళ్ళిచేసుకోమని, అదే తన తుదికోర్కెయని చెప్పి ప్రాణం వదిలాడు. ఆమె నాన్న వకీలుగాచేసి లక్షలు గడించాడు ..''

''ఆ....ఇప్పుడు మాత్రమేమైంది. వాడు కాదన్నాడా? ఈ ఆడపిల్లల ధోరణే అంత. మగవాళ్ళు కాస్త ఊసుపోక నాల్గు మాటలు మాట్లాడితే చాలు, కలానికి పని కల్పిస్తారు.

''ఇంకా వాడిని నమ్ముతున్నావన్న మాట. రానీ వాడిని ఏమిచేస్తానో చూడు. ఈ నీలకంఠానికి కోపం రానేరాదు. వచ్చిందా, హుం...నీకు తెలుసుగా,''

''వాడినేమనకండి. వాడు ఒక్కగానొక్క కొడుకు. వాడికోసమేగా యీ సకలసంపదలు. వాడి సంతోషానికేగా మీరింత డబ్బు గడించింది. వాడు మన కంటి ఎదుట లేకపోతే మన జీవితాలు ఎలా ఉంటాయో ఊహించారా? వాడు సుహృదయుడు. నయాన చెప్పి చూడండి.''

అంతలో బ్యాటు త్రిప్పుకుంటూ నవ్వుతూ క్లబ్‌నుంచి వస్తున్న వాసును చూచారు నీలకంఠంగారు. నాన్నగారి ముఖకవళికను చూడగానే భయమేసింది వాసుకి.

''ఏరా వాసూ? ఇటురా'' అని పిలిచాడు.

''ఏంటి నాన్నా!'' అన్నాడు, వణుకుతున్న పెదవులతో వాసు.

''హుం!!! నా.. న్న ..నీవే నన్ను నాన్నగా భావించేటట్లయితే నా మాటను నెఱవేర్చు. లేకపోతే...''

''ఎప్పుడు కాదన్నాను నాన్నా నీ మాటను.''

''సరే. చెబుతున్నా విను. నీవు సు...జా. తను మఱచిపో. నేను చెప్పిన అమ్మాయిని పెళ్ళిచేసుకో. లక్షలు వస్తాయిరా లక్షలు! ఇటు డబ్బు వస్తుంది. అటు నా మాటా దక్కుతుంది. హుం... ఆలోచించుకో.''

''అది నావల్లకాదు నాన్నా! సుజాతను మనసారా ప్రేమించాను. నామీద చాల ఆశపెట్టుకుంది. ఊహాప్రపంచంలో మేడలు కట్టింది. నావలన తన జీవితాన్ని ధన్యం చేసికోవాలని పలుసార్లు నన్ను కోరింది. నా హృదయంలో ఆసనాన్ని నిర్మించుకుంది. అట్టి నా సుజాతను మఱచిపోవటం యీ జన్మకు లేదు నాన్నా!''

''సరే! ఆఖరుసారిగా చెబుతున్నా. నామాట విన్నావా, తండ్రికొడుకుల సంబంధం చిరస్థాయిగా నిల్చిఉంటుంది. లేదా, నేను తండ్రిని కాను నీవు కొడుకువు కావు. ఆలోచించుకో'' అంటూ కోపంగా శ్రీమతి వారించినా ఆగక డ్రైవరును పిలిచి టాక్సీలో తన స్వీట్సు కంపెనీకి వెళ్లాడు.

ఆ టాక్సీ కంపెనీ ఆవరణలో ఆఫీసు రూమ్ ముందు ఆగింది. నీలకంఠంగారు టాక్సీ దిగి ఆఫీసు రూములోగుండా తన రూమ్‌లోకి వెళ్ళాడు. దానిలో మూడు కుర్చీలు ఉన్నాయ్. వాటిమధ్య విలువైన సిల్కుగుడ్డ పర్చబడి ఒక డ్రాయరు ఉంది. ప్రక్కన ఒక బీరువా ఉంది. డ్రాయరు పైన ఫోను అమర్చబడి ఉంది. నీలకంఠంగారి చూడ్కులు ఒక్కసారిగా ఆ ఫోనుపై

ప్రసరింపసాగినవి. వెంటనే రిసీవర్‌ను చెవ్వు దగ్గఱ పెట్టుకొని మాట్లాడసాగారు.

"హల్లో! పంకజమ్మగారూ!

..........................

"ఎవరు మీరు?"

..........................

"ఆ! సుజాతా!"

..........................

"పంకజమ్మగారికి నువ్వేమవుతావ్?"

..........................

"ఆ! పంకజమ్మగారి కూతురువా! నీవేమి చేస్తుంటావ్"

..........................

"బి. ఎ. చదువుతున్నావా! అయితే వాసు అనే అబ్బాయిని ఎరుగుదువా?

..........................

"అయితే, వాసుకి ఉత్తరం వ్రాసింది నీవేనా?

..........................

"ఏం ఊరుకున్నావ్? చెప్పమ్మా ఫర్వాలేదు."

..........................

"అవునా! ఆ...అయితే నువ్వే పంకజమ్మగారి కూతురువన్నమాట. ఉత్తరం వ్రాసింది నీవా! సరే. అయితే నేను మీ నాన్నగారి ముఖ్యస్నేహితుణ్ణి. నన్ను కడి భుజంగా వారు తలంచేవారు. నిన్ను చూచి చాలా కాలమైంది. నీవు నన్ను ఆట్టే ఎరుగవు. కాని మీ అమ్మకు బాగా తెలుసు. మీతో మాట్లాడవలసిన పనుంది. కావున మీ అమ్మగార్కి నా మాటలుగా చెప్పి తక్షణం మీరిద్దరూ బయలుదేరి మా యింటికి రండి" అంటూ ఫోనును ముగించాడు.

"నీలకంఠంగారి ముఖం వికసించింది. ఆయన ఆనందానికి అవధులులేవు. కంపెనీ మేనేజరుగా తనకున్న కాస్త పనులు ముగించుకొని సాయంకాలం కారులో బయలుదేరి యింటికి వచ్చారు.

"ఏమేవ్! మా స్నేహితుని కూతురునే పెళ్ళిచేసుకోమని మన వాసుతో పోరాడితినే, ఆ అమ్మాయినేనంట మన వాసు ప్రేమించింది. ఆ అమ్మాయే నాతో మధ్యాహ్నం ఫోనులో మాట్లాడింది. అంతా 'విధివశం'. ఎవరు తప్పించుకో గలరు" అన్నారు నీలకంఠంగారు, అప్పుడే తీక్షణచూపులతో వచ్చిన శ్రీమతితో.

"అబ్బ! నా మనస్సిప్పుడు కుదుట బడింది. మీ కోపాగ్ని చూచి ఎంత తహతహలాడానని అనుకున్నారు" అని అంటుండగానే పంకజమ్మ సుజాత లిద్దరూ వచ్చారు.

"నమస్కారమమ్మా పంకజమ్మగారూ" అన్నారు నీలకంఠంగారు సంతస వదనంతో.

"నమస్కారమండీ! నమస్కారమమ్మా!" అని యిద్దరకూ నమస్కరించింది పంకజమ్మ సవినయంగా.

"రామ్మా సుజాతా! కూర్చోమ్మా!" అంటూ చేతిని లాగి కూర్చోబెట్టింది కుర్చీలో శ్రీమతి.

ఇంతలోనే, వాసు యీసారి బిక్క మొగముతో దిక్కులు చూచుకుంటూ

వస్తున్నాడు తండ్రి ఉంటాడన్న విషయము వూహించి. ఒక్కసారిగా తన ప్రేయసి, సుజాతను చూచి సంతోషసముద్రంలో మునిగిన వాసు "హాల్లో" అని, తండ్రిని చూడగనే నాలుక కొరుక్కున్నాడు. కాని తండ్రిగారి ముఖంలో సంతోషం తాండవిస్తోంది. తనకోరిక ఫలించదేమో, తన ప్రేయసిని స్వీకరించటానికి తల్లిదండ్రుల మెడబాటును భరించవలసి వస్తుందేమో నని సతమతమవుతున్న వాసు, పరిస్థితు లిట్లు అనుకూలంగా ఉంటాయని తాను యిప్పటివరకు ఊహించలేదు. ఇదంతా 'విధివశం', 'బ్రహ్మవ్రాత' అని తలంచి లోలోన సంతసించాడు.

"అరే వాసూ! యీమే నా నీ ప్రేయసి?" అని అడిగాడు తండ్రి సంతోషంతో.

అవును అన్నట్టు తలవూపాడు వాసు.

"అయితే, పంకజమ్మా! సుజాత, వాసులు ప్రేమించుకున్నారట. మన మాటలు లేకుండానే వాళ్ళ పని వాళ్ళు నిర్వర్తించుకున్నారు. ఇక మనం పున్నాముగా అక్షింతలు వేయటానికి. పురోహితుని పిలుద్దామా లగ్నం పెట్టేందుకు? ఇంకా ఆలస్యం ఎందుకూ! 'శుభస్య శీఘ్రం' అన్నారు పెద్దలు" అని అన్నాడు సంతోషస్వరంతో.

పంకజమ్మ సుజాతవంక చూసింది. సుజాత సిగ్గుతో తలవంచుకుంది అంగీకార సూచకంగా. "సరే. మీకంతా యిష్టమయితే నాదేముంది" అంది పంకజమ్మ.

"అబ్బ! నా స్నేహితుని ఆత్మశాంతి 'విధివశం'వల్ల యీనాడు చేకూరింది. అంతేచాలు" అంటూ టాక్సీ డ్రైవరును పురోహితుని కొఱకు పంపాడు. ఇల్లంతా నవ్వులతో కళకళలాడింది.

---

# త్రాగుబోతు

జర్మను మూలం:
హాన్స్ ఫల్లాడా

ఆంధ్రానుసరణ:
డాక్టరు వి. ఎన్. శర్మ



## ఇంతవరకు సాగినకథ

[వర్తకవ్యాపారాలలో మంచి చెయ్యి అనిపించుకున్న సొమ్మర్ అనే ఆయన ఆత్మచరిత్ర మనం ఇంతకాలంనుంచీ చదువుతూ వున్నది. సొమ్మర్ కలలుకంటూ వున్నట్లు పరిస్థితులు అనుకూలంగా లేకపోవటం మూలాన ఆయన ఆ బెడద మరచిపోడానికి పానీయం రుచిచూడటానికి మొదలెట్టాడు. అది క్రమేణా పెద్ద వ్యసనంగా అయిపోయింది. దాని మీద చూపెడుతున్నంత వుత్సాహం, శ్రద్ధ వ్యాపార సంస్థమీద చూపటం మానేసినందున వ్యాపారసంస్థ దెబ్బతిన్నది. భార్య మాగ్దా ఈ సంగతి తెలుసుకోటంతో ఆవిడమీద యుద్ధం ప్రకటించాడు. అతని త్రాగుబోతుతనాన్ని మాన్పించటానికి ఆవిడ పంపిన డాక్టర్లమీద కత్తులుదూశాడు. లోబెడాన్సు అనే కాలాంతకుడి ఇంట్లో తిష్ఠవేశాడు. డబ్బు కక్కుర్తి అవటంతో ఒకనాటి అర్ధరాత్రి సొంత ఇంటిలో దొంగతనానికి తయారైనాడు. లోబెడాన్సు చేస్తున్న మోసం తెలుసుకొని అక్కడనుంచి బయటపడటానికి ప్లాన్లువేశాడు. బ్యాంకులో వాళ్ళకున్న సొమ్మునంతా తీసుకుని వెళ్ళిపోవాలని తతంగం పన్నాడు. తరువాత కథ ఎలా సాగిపోతోందో! — ఇక చదవండి.]

## I

వాడు అక్షరాలా శనిగ్రహమే! ప్రారంభంలో మా లోబెడాన్సు అమాయకుడనుకున్నాను వాడు చూపెడుతూవున్న వినయ విధేయతలకి ఆశ్చర్యపడుతూ! కాని లోబెడాన్సు నాబలహీనత క్షుణ్ణంగా తెలుసుకున్నాక నాకే ఆదోవన ఈదోవన వుచ్చులు వేస్తూ తనకి దాసానుదాసుడ్నిగా చేయటానికి ఎంతో తతంగం పన్నాడు. అదృష్టవశాత్తు ఆ రహస్యం గ్రహించాను.... తన కోటులో పెట్టాక. అంచేతనే వాడి చేతిలో అప్పుడు నాకు అందిన నోట్లని పెట్టిలోనుంచి తీసివుంచేసి మంచి పానీయం తీసుకురమ్మని వూళ్ళోకి పంపాను. చెప్పినపని చేసుకరావటానికి ఒక గంటపైగా పడుతుందని తెలుసు. ఈలోపున్నే వాడి ఇంటి పరిసరాలకి ఒక నమస్కారముపెట్టి ఇలా వచ్చాను. నా పత్తా తెలుసుకోలేక తికమకపోతాడని సంతోషించాను......

చుక్క ఎదురైంది. నేను వేసుకున్న ప్లాన్లు తారుమారయ్యాయి. వాడు నిజంగా రంధ్రాన్వేషి! లేకపోతే బ్యాంకులోనున్నానన్న సంగతి వాడికి ఎలా తెలుస్తుంది?... లోపలినుంచి బయటికి అడుగుపెట్టటంతో వాడు నా ముందర ప్రత్యక్షం! ఇప్పుడీ శనిగ్రహాన్ని చూడటంతో ఒళ్లు వుడికిపోతున్నది. రెండు లెంపకాయలు వేసి నాదోవన నేను వెళ్ళిపోవటం మంచిదనుకున్నాను. ఆ పని ఇక్కడచేశానా ఇంకేం వుంది?...

బ్యాంకి చుట్టుప్రక్కల ఆఫీసులు ఎన్నో వున్నాయి. మా వూరి మార్కెట్ కూడా అక్కడే! ఆ పరిసరాలలో నాకు బాగా తెలిసినవాళ్లెంతమందో తారట్లాడుతూ వుంటారు!... నేను లెంపకాయలు వేస్తే ఆ శనిగ్రహం వూరకుంటుందా! ఎంతో రాద్ధాంతం తప్పక చేస్తుంది. చుట్టుప్రక్కలవాళ్లు

ఇదంతా చూశారా—మా చుట్టూ మూగుతారు దాంతో...

ఆ పరిసరాలనుంచి ఆ క్షణాన్న వెళ్లిపోవటం అన్నివిధాలా మంచిదనుకుంటూ లోబెడాన్ని నాకు తెలియనట్లే నటిస్తూ పెట్టె పుచ్చుకుని రైలుస్టేషను మార్గంకేసే నడవసాగాను. ఆవలిస్తే ప్రేగులు లెక్కపెట్టడంలో మా లోబుడాన్ని గట్టివాడు. నావెనుక వాడూ పరుగెడుతూ "ఏమండోయి"—ఏంకొంప మునిగిపోయిందని అలా హుటాహుటిగా నడవటం! "మీకోసం బ్యాంకు ముందర వేచివున్నాను. మీరు తెమ్మని ఆజ్ఞాపించిన పానీయం తెచ్చాను..." అంటూ నన్ను నడిదోవలో ఆపుతూ "మీరు పెద్దమనుష్యులు. మీ నవుకరని నేనుండగా మీ రంతపెద్ద పెట్టె పుచ్చుకుని నడవటం ఏం బాగాలేదు. నన్నే ఇందరిముందర అవమానంచేసినవాళ్ళవుతారు!......పెట్టె ఇలా యియ్యండి. ఎక్కడికి మోసుకురమ్మంటే అక్కడికి మోసుకుని రావటానికి నేనున్నానుగా! ..." అని అంటూ నాచేతిలోనుంచి పెట్టె లాక్కున్నాడు, ఇంతవరకు నాలో రేగేతూవున్న కోపాన్ని ఎలాగో మ్రింగివేశాను. ఇప్పుడు నాపెట్టె అలా బలవంతంగా లాక్కోడంలో వాడిమీద మండిపడుతూ "నౌకరి వద్దు. మరేవళ్ళూవద్దూ. నాపెట్టె నాకు ఇస్తావా లేదా!" అని వురిమి చూస్తూ అరిచాను.

నా బాణాలు వాడిముందర పనిచేస్తాయా? అతను నా కోపతాపాలకి ఫక్కున నవ్వుతూ "ఇలా మీవంటివాళ్ళు నడివీధిలో అరవటం ఏం బాగాలేదు. మీ ప్రతిష్టకి భంగంకూడా!... నేను బీదవాణ్ణి..." అని ఏమేమో గొణగసాగాడు. వాటికి ఏమాత్రం లెక్కచేయకుండా వాడి మాటలకి అడ్డువస్తూ "నా పెట్టె ఈ క్షణాన్నే నాకు ఇచ్చివెయ్యకపోతివా..." చురచుర చూస్తూ అన్నాను.

దోవలో నడుస్తున్న వాళ్లు మాకేసిచూస్తున్నారు. "అంతా తరువాత చూసుకుంటాం. జనం మనకేసి చూస్తున్నారు. అది మీవంటివాళ్ళకి అప్రతిష్ఠ. నేను మీమనిషికదూ! నన్నే దానిని మోసుకరానీయండి... మీరు వెళ్ళేది రైలుస్టేషనుకేసి కేకదూ?" అని మెల్లగా చెవిలో వూదాడు. దాంతో వూరుకుని వున్నాడా? గబగబా నాకన్న ముందుగనే పెట్టెని పుచ్చుకుని నడుస్తూ వున్నాడు....

అన్నిటికి తెగించినవాడు లోబెడాన్స్. అతను అలా ముందుకు నడుస్తూవుంటే అతనివెంట నడుస్తూ వుండక మరేంచేయగలుగుతాను! దోవలో పోలీసు స్టేషను వుంది. అక్కడికి తిన్నగా వెళ్ళిపోయి నామీద రిపోర్టు చేశాడా?...ఇంకేంవుంది?...అంచేత చడీచప్పుడు లేకుండా వాడివెంటే నడుస్తూవుండటమే మంచిదనుకున్నాను...

వాడివెంట ఇలా నడవటం నాకేం నచ్చలేదు. దోవలో నాభార్య కొంపనుంచి కనబడితేనో?... ఆవిడ కాకపోతే మా గుమాస్తాలు ఎదురైతేనో?... ఈ బెడదనుంచి తప్పుకోటానికి ప్రక్క సందుల్లో మాయమైపోతేనో? అలా చెయ్యవచ్చు. కాని పర్యవసానమో?

నా పెట్టె ఆ మాయదారికి చిక్కిపోతుంది. రాత్రి ఎంతో కష్టపడి మా ఇంట్లో చేతికి చిక్కిన సామాన్నంతా దాన్లో భద్రపరిచాను. నాదుస్తులువున్నాయి. అపరూపమైన వెండిసామానువుంది...లెక్కపెడితే రెండు మూడువేలకి పైగానే వుంటుంది. దాన్నంతా సాధించింది కుచ్చితమార్గంలో. నా భార్య రాత్రే పోలీసులకి రిపోర్టుచేసింది. దాన్నంతా వీడికి వదలుకున్నా ఫరవాలేదు. బోలెడుసొమ్ము నాదగ్గరవుంది. దాంతో ఈ రథాన్ని కొంతకాలం చీకూచింతా లేకుండా నడుపుకుంటూ వుండవచ్చు...తరువాత సంగతా—దాన్నంతా తాపీగా ఆలోచించుకోవచ్చు ఇప్పుడు ఎటుకేసి వెళ్లిపోతే బాగుంటుందీ... ఇలా అనుకుంటూ కొంతదూరం ముందుకి నడుస్తున్నాను...

దోవలో మావూరి పార్కు వుంది. టాయిలెట్ గదులు దూరాన్నుంచే బాగా కనబడుతున్నాయి టాయిలెట్ గదిలో కొంచెంసేపువుండిపోయి ముందు చేయాలసిన పని ప్రశాంతంగా ఆలోచించుకోటం మంచిదనుకుంటూ గబగబ అటుకేసి నడుస్తున్నాను. లోబెడాన్ని కాలాంతకుడు. వాడివెనుక రాకుండా అక్కడ ఆగిపోవటం వాడు ఒక్కనిముషంలో పసికట్టాడు. ఆదరాబాదరా నాకేసి వస్తూ "ఇక్కడ మీరు ఆగటం బాగావుంది. మీతో చెప్పాలిసిన సంగతులు ఎన్నోవున్నాయి. లోపలికి వెళ్దాంరండి" అని అన్నాడు. ఆ సమయంలో వాడికి ఎంతట్టిందో లాగు జేబులోనుంచి పెద్ద సీసా తీసి నాకు చూపెడుతూ "మీరు ప్రొద్దున తెమ్మన్న సీసా. అపరూపమైన వస్తువు దొరికింది. ఆ దుకాణంలోనే నీళ్ళప్రాయంగా ఎంతసొమ్ము ఆబుడ్డికోసం ఇయ్యాలిసి వచ్చిందో ఇప్పుడు చెప్పడం అనవసరము. మీకు నచ్చిన పానీయం! అటు మా ఇంట్లోనుంచి బయట పడటానికి ఇటూ నావెంట ఈ దోవలో నడవటానికి ఎంతో కష్టపడాలిసి వచ్చింది...దీన్ని ఇక్కడ

ఇప్పుడే రుచి చూశారా అలసట తీరిపోతుంది. హుషారు వస్తుంది. అప్పుడు నా మంచితనాన్ని మీరే బాగా గుర్తిస్తారు" అంటూ చూపాలసిన నక్క వినయాలు చూపాడు. తనే బిరడాతీసి బుడ్డి చేతి కిచ్చాడు.

ఇవ్వాళ పానీయాలజోలికి పోగూడదని నిశ్చయం చేసుకుని లోబెడాన్స్ ఇంట్లోనుంచి బయలుదేరి వచ్చాను. మత్తుమీద వుంటే ఏం కొంపముగుతుందో అనుకుని స్టేషను హోటల్లో వున్నంతకాలం పానీయాలికి స్వస్తిచెప్పి వచ్చాను... ఇప్పుడు ఈ రాక్షసి ఇలా పానీయాన్ని నా చేతికిస్తూ పాతదోవలోకి అమాంతంగా లాక్కుని వెళటానికి తన వుచ్చుతాళ్లని నామీద విసరివేస్తున్నాడు. ఇప్పుడు ఏంచెయ్యాలి?.

పుచ్చుకోటానికి తటపటాయించటం లోబెడాన్స్ చూస్తూ "ఏమండీ ఎందుకలా సంకోచించటం? మీరు పెద్దలు. మీకోసమే ఎంతో కష్టపడి దీనిని సాధించి తెచ్చాను, ఒక బొట్టు రుచి చూడండి..." బలవంతం చేయసాగాడు...

పానీయాన్ని ఒక్కక్షణంలో పూర్తిచేశాను. "ఇక మన లెఖసంగతి ఆలోచించుకుందాం" నేను దోవలోకి వచ్చినందుకు తృప్తిపడుతూ అన్నాడు.

"ఏం లెఖ?" అని ఆశ్చర్యపడుతూ అడిగాను.

"మీరు బ్యాంకులోకి వెళ్ళటం నాకు తెలియదనుకున్నారా? అక్కడనుంచి ఎంతసొమ్ము తెచ్చారు? మీరు వుదారవంతులని నాకు తెలుసు. దాన్లో నాకు రావలసిన భాగాన్ని చప్పున ఇచ్చివెయ్యండి" అని దబాయించటానికి ప్రారంభించాడు... ఆ...

ఆ సమయంలో లోపలవున్నది మేం ఇద్దరమే. అతను ఇచ్చిన పానీయం రుచిచూడటానికి బాగానే వుందిగాని, లోపలికి పోవటంతో అది చేసిన కథాకమీషూ ఇంతింతని మాటలతో చెప్పాలా? కడుపు మండి పోతున్నది. తలనొప్పి. వాంతులు! ఒళ్ళు ఎవళ్ళో దభాలున కొట్టినట్లు నొప్పి...

అమాంతంగా క్రిందికి నెట్టాడు లోబెడాన్స్ నా యీ అయోమయావస్థని చక్కగా పసికట్టుతూ. అంతకుముందే నేలని ఫినైలుతో కడిగారు. అందుచేత లోపలంతా జారుడుగా వుంది, ఆజారుడుని రెట్టింపు చేయటానికి నా వాంతులు...

క్రిందకి పడదోసినవాడు ఇక వూరక వుంటాడా? నా జేబుల్ని పరీక్షిస్తూ బ్యాంకునుంచి తెచ్చినసొమ్ము తనచేతి కిమ్మని సతాయించసాగాడు. సొమ్ము అతనికి ఒప్పగించకపోతే ఎలాటి అఘాయిత్యం చేయటానికీ తయారుగానున్నాడన్న సంగతి నాకు తెలుసుగా! బ్యాంకులోనుంచి తెచ్చుకున్న కట్టలు లోపలి జేబుల్లో నున్నాయి. రాత్రి మా ఇంట్లోనుంచి తెచ్చుకున్న నోట్లు బయటి జేబుల్లోవున్నాయి. వాటిని పైకి తీస్తూ అతనికి చూపెట్టాను, నోట్లని చూడటంతో అతనికి వాలకం మారిపోయింది. వాటికేసి తదేక దృష్టితో చూస్తూ వాటిని పుచ్చుకుని తన జేబులో దాచుకున్నాడు...

తరువాత ఏంఅనుకున్నాడో లోపలిజేబుల్లో ఏం వుందో చూపమని వురిమిచూస్తూ అన్నాడు. అపనికి తలఒగ్గనా ఇంకేంవుంది?... తన ఆజ్ఞని నేను శిరసా వహించనందుకు కోపపడిపోతూ వేసుకున్నచొక్కాని లాగటానికి మొదలెట్టాడు. నేను ఎంత ప్రతిఘటించినా లాభం వుంటేగా! చుక్క ఎదురైపోయింది అతనిది పైచెయ్యి అయిపోయింది. లోపలి కట్టలని చేచిక్కించుకున్నాడు ..

వాటిని అతనికి దక్కకుండా వుండటానికి ఆ స్థితిలో చేయాలిసిన పనినంతా చేశాను. క్రింద పడి వున్నవాణ్ణి ఎలా లేచానో లేచి, అతని పొట్టమీద ఒక గుద్దు గుద్దాను. దాంతో గిలగిల కొట్టుకుంటూ అతను క్రిందపడిపోయాడు. చేతిలోనున్న కట్టల్లో ఒకటి ఆ మూలన ఇంకొకటి ఈ మూలన పడిపోయింది...

ఆ సమయంలో లోపలికి ఎవళ్లో వస్తున్న సందడి వినబడుతున్నది. తలుపు వోరగా తెరుచుకుని బయట నుంచి ఒకాయన లోపలికి ప్రవేశిస్తూ ఇక్కడ జరుగుతున్న నాటకాన్ని చూస్తూ విస్తుపోతూ "మీరు చూడటానికి పెద్దమనుషులకిమల్లె కనబడుతున్నారు... ఇక్కడ ఈ టాయిలెట్‌లోనా ఇదంతా..." అని అన్నాడు.

దాంతో లోబెడాన్స్ హడలిపోయాడు. ఇక అక్కడవుంటే ఎలాటి ప్రమాదానికి లోనుగావలసి వస్తుందో అతనికి బాగా తెలుసు. పడిపోయివున్నవాడు చటుక్కన లేచాడు. తనదగ్గరే పడివున్న కట్టని చేజిక్కించుకుని, ప్రక్కనేవున్న పెట్టెను పుచ్చుకుని మరో క్షణంలో అక్కడినుంచి అదృశ్యమయ్యాడు.

లోపలికి వచ్చిన మనిషి నాకేసి చూస్తూ ఆశ్చర్యపడ్డాడు. అతను మా పోస్ట్‌మన్. తలుపుతీసుకొని లోపలికి వెళ్లబోతూ "ఏమండోయ్! మీరు సోమర్ గారు కదూ! మొదట ఎవరో అనుకున్నాను." అని అన్నాడు.

నలుప్రక్కలా కలయచూశాను. అక్కడ ఎవళ్లూ లేరు. నా దుస్తులు మట్టి మశాన్నంతో అధ్వాన్నమై పోయాయి. ఇక అక్కడినుంచి వెళ్లటమే మంచిదనుకుంటూ ముందడుగు వేశాను. కాలికి కట్ట తగిలింది. నా అదృష్టం పండింది. నూరు మార్కుల కట్ట చెక్కు చెదరకుండా వుంది. మొత్తం వెయ్యి. నూరుమార్కుల నోట్లు పది. కట్టని ఎత్తి జేబులో జాగ్రత్తపరుచుకున్నాను. దుస్తులని శుభ్రంచేసుకుని తలదువ్వుకుని లోపలినుంచి బయటికి వచ్చాను.

## II

నా పెట్టిపోయింది. తోలుపెట్టె. వ్యాపారరీత్యా విదేశాలకి వెళ్లినప్పుడు అప్పుడు అక్కడ ఎంతో సొమ్ము ఖర్చుపెట్టికొన్న పెట్టె పోయింది. దాన్లో జాగ్రత్తపరచబడ్డ దుస్తులు పోయాయి. వెండి సామాన్లు పోయాయి. బ్యాంకునుంచి తెచ్చుకున్న అయిదువేల నోట్లల్లో నాలుగువేలు పోయాయి. ఇక నిమిషమైనా వూర్లో వుండిపోయానా ఏ ప్రమాదం ఎదుర్కోవాలసి వుందో నాకు స్పష్టంగా తెలుసు. మా వూరికి, ఆ పరిసరాలకి ఒక నమస్కారంపెట్టి స్టేషను చేరుకున్నాను. రైలుబండి స్టేషను ప్లాటుఫారంమీద వుంది. రెండో తరగతి టిక్కెట్టు కొనుక్కొని బండిలో కూర్చున్నాను. బండి కదలింది. మా శనిగ్రహాన్ని వదలించుకొని విశాల ప్రపంచంలోకి వెళ్లుతున్నాను...

పెట్టిలోవుంది నేనొకడ్నే. అప్పుడు లోబెడాన్సు ఇచ్చిన బుడ్డిలో ఇంకా పానీయం వుంది. దాన్ని నాలాగు జేబులో ఎలా భద్రపరచుకున్నానో ఇప్పుడు చూస్తుంటే ఆశ్చర్యం వేస్తూవుంది. అప్పటి హుడాహుడిలో వాంతులు చేసుకున్నా ఈపానీయం మంచిదని నాకు తెలుసు. ఇప్పుడు దాహమవుతున్నది. ఒక గుక్కెడు పుచ్చుకున్నా నా దాహం తీరుతుంది. ఇప్పుడు ఏంచెయ్యాలో ప్రశాంతంగా ఆలోచించుకోవచ్చు. ఒక గుక్కెడుతో నేను అనుకున్నట్లు దాహం తీరింది. ఎంతో హుషారు కలిగిస్తూవుంది. కిటికీలోనుంచి బయటికి చూడసాగాను. ఎటుచూసినా పచ్చిక బయళ్లు, తోటల్లు, పొలాలు. పశు పక్ష్యాదులకి కావలసిన స్వాతంత్ర్యం ఈవిశాల ప్రపంచం ప్రసాదిస్తూ వుండటం కళ్లార చూడవచ్చు. ఇంతవరకు వుక్కిరిబిక్కిరై పోతున్న సంకుచిత వాతావరణాన్ని ఇప్పుడు పూర్తిగా మరచిపోవచ్చు. చేతిలో డబ్బువుంది. కొంచెం పొదుపుగా వాడుకున్నా నా రెండు మూడు సంవత్సరాలు ఏ బెడద లేకుండా కాలక్షేపం చేయవచ్చు. తరువాతో? ఆ గొడవతో బుర్రని వేడిచేసుకోట మెందుకు? నాపత్తా ఇక నా భార్యకి తెలియదు. ఆ కాలాంతకుడు లోబెడాన్సు నా గుట్టు తెలుసుకోటానికి ఇక ఎలాటి అవకాశం వుండదు. అప్పటి నా జీవితమార్గం ఒక ఎత్తు. ఇప్పుడు నేను నిర్మించుకోబోతున్న మార్గం ఒక ఎత్తు. దీన్ని యథాతథంగా నిలువబెట్టుకున్నానా ఇక వాళ్ళని వీళ్లని చూస్తు భయపడట మెందుకు?...

నేను అనుకున్న వూరికి చేరుకునేటప్పటికి మిట్ట మధ్యాహ్నమైంది. మావూరంత పెద్ద వూరు కాదు. కొండల మధ్యవున్న చిన్న వూరు. మంచి గాలికోసం వచ్చేవాళ్లకోసం వూళ్ళో హోటలు వుంది. స్టేషను నుంచి అటుకేసి నడిచాను. అతిథులు భోజనాలకి కూర్చున్నారు. ఎప్పుడు భోంచేశానో? ఎలాటి వాతావరణంలో భోజనంచేయాలసి వచ్చిందో నాకు బాగా తెలుసుగా!...

ఈ పరిసరాలకేసి ఎప్పుడూ వచ్చినవాడ్నికాను. అంచేత నాకు తెలిసినవాళ్లెవళ్ళూ ఇక్కడ కనబడలేదు. అదీ ఒక విధంగా మంచిదే అనుకుంటూ హోటల్లో భోంచేసి అక్కడే కొంచెంసేపు విశ్రాంతి తీసుకున్నాను. తరువాత వూరంతా ఒకసారి చూసి రావాలని వుబలాటపడుతూ బయలుదేరాను. చేతి సంచి కొన్నాను. కొత్తజీవితం ప్రారంభించటానికి ఏయే వస్తువులు అవసరమో వాటిని కొన్నాను. త్రాగుబోతునని నాదగ్గర కూర్చున్నవాళ్ళు గుర్తుపట్టకుండా వుండటానికి ఎలాటి కట్టుదిట్టాలు అవసరమో వాటిని యథాతథంగా చేసుకుంటూ అక్కడ పేరు ప్రఖ్యాతులు గాంచిన పానీయశాలలోకి ప్రవేశించాను. దాని యజమానికి పానీయాల సంగతి క్షుణ్ణంగా తెలుసు. ముసలాయన. కబుర్లు చెప్పటమంటే సరదా! ఇప్పటి నా అజ్ఞాతవాసంలో నాకు కావలసింది అలాటివాళ్లేగా! వర్తకసంస్థకి యజమానిననిన్నీ, మంచి గాలిపీల్చటానికి ఈ వూరికి ఇవ్వాళే వచ్చానని ఆయనతో అంటూ నన్ను నేను పరిచయం చేసుకున్నాను.

అక్కడ మంచి పానీయాలు వున్నాయి. ప్రతి దాని గొప్పదనాన్ని చెప్పటానికి యజమాని ప్రారంభించాడు. స్వదేశంలో తయారుచేయబడ్డ సరకూ వుంది. విదేశాలలో తయారుచేయబడ్డ సరకూ వుంది. మావూళ్లో సరకు వున్నదని పేరేగాని ఫీటిలో

పోల్చితే నరకం ఎక్కడ దేవలోకం ఎక్కడ?... నాకు అన్నిటికంటే బాగానచ్చింది ఒక మేలురకపు పానీయం. రుచిచూస్తుంటే ఒళ్లు మంటలు మండుతూ వున్నట్లు వుంటుంది. కొంచెం కారం సరుకుకూడా! అయినా దానిది మంచి రుచి. బాగా పండిన పండ్ల వాసన, నా జీవయాత్రకి ఇలాటి పానీయం చక్కగా సరిపోతుందని వుబలాటపడుతూ అయిదు బుడ్లని కొన్నాను. అలాటిబుడ్లకోసం ప్రత్యేకంగా తయారు చేయబడ్డ బుట్టలో వాటిని ప్యాక్ చేయించాను...

చీకటిపడేలోపుగనే వచ్చిన దోవనే తిరిగి వెళ్లడం మంచిదనుకుంటూ స్టేషనుకు చేరుకున్నాను. రైలుబండి రావడంతో దాన్లో ఎక్కాను. మావూరు చేరటానికి ముందు బండి ఒక స్టేషనుదగ్గర ఆగింది. అది మా ఎలినావూరు. పానీయాల రుచి ప్రప్రథమంలో అలవరచుకుంది ఈ వూర్లోనే. ఈవూరి హోటలు అధిష్ఠానదేవత ఎలినా!...ఇవ్వాళ ఈ స్టేషనులో దిగడంతో అకోజుల్లో రాత్రిపూట జరిగిన పరాభవాన్ని మరచిపోయాను. డాక్టర్లు రావటం నాకేసి వింతగా చూడటం, నా దగ్గరకే వచ్చి కూర్చోటం, నన్ను వాళ్ల కారులో వాళ్ళవెంట తరలించుకుని వెళ్లడం... ఆ విషాదకరమైన సంఘటనలు పూర్తిగా మరచిపోయాను. పానీయాలకి దాసానుదాసులైనవాళ్లు ఇలాటి సంఘటనలు ఎలాతప్పించుకోగలుగుతారు?... పానీయం మనస్సునే చిందరవందర చేస్తుంది. ఎలాటి శాంతమూర్తినైనా కోపిష్టిగా మార్చివేస్తుంది. ఆ కోపతాపంలో బొత్తిగా హద్దూపద్దూనే మీరి పోవాలని వస్తుంది...

ఇదంతా నాకు తెలుసు. మార్గాని మోసంచేశాను. అది సామాన్యమైన మోసమైతేగా! మా ఇంట్లో మా పనిమనుషులముందు నా మార్గాని అవమానంచేశాను. ఆవిడ ప్రాణప్రదంగా చూసుకుంటూ వున్న అమూల్యమైన వస్తువులు దోచాను. ఇక నాభార్య నన్ను మా ఇంటి పరిసరాలకేసి రానిస్తుందా మరి?...

ఇక ఆ లోబెడాన్సు సంగతి చెప్పడం అనవసరం కదూ! వాడింట్లో తలదాచుకోటానికి వెళ్లినప్పటి నుంచి వాడితో అంత చనువుగా వుండిపోకుండా వుంటే పరిస్థితులు ఇంకోవిధంగా వుండి వుండేవి. చీకూచింతా లేకుండా అక్కడే కొంతకాలం కాలక్షేపం చేసివుండేవాణ్ణి! కాని అక్కడకూడా చుక్కఎదురైంది. అందుచేత అక్కడికి వెళ్లటానికి అసాధ్యం.

ఇలాటి నా దుర్భరావస్థలో నన్ను చేరదీసి ఆదరించ కలిగేది ఆ హోటలు అమ్మాయి! ఆ ఎలినా! అక్కడే అజ్ఞాతంలో నాకు ఇష్టంవచ్చినంతకాలం వుండిపోవచ్చు. అలా వుండటానికి వీలుకాకపోతే, ఎలినాతో కలిసి దేశదేశాలు చుట్టిరావచ్చు. దానికి కావలసినంత ఆర్థికస్తోమత నాకువుంది... ఇదే స్టేషను నుంచి అటుకేసి నడవటానికి వూత నిచ్చింది...

# నిర్ణయము

విద్వాన్ యం. వి. ఆర్. కృష్ణశర్మ

---

శంభునకుం గుమార్తె నిడ సమ్మతి నిమ్ముగ మందహాస మా
నంబులఁ జూపఁగా సతి, యనంతముదంబు భృశంబు గ్రమ్మఁ జి
త్తంబున శక్తిభక్తి మెయిఁ దాపసవర్యులఁ బూజసేసి వే
గంబున స్వీయపుత్రికను గైకొని పర్వతనాథుఁడంతటన్.

కూరిమి నొప్పుచుండఁ దన కూఁతును నకతలంపుపై వెసం
జేరిచికొంచు ముంగురులు చిక్కులఁదీయుచు మౌనివర్యులుం
గోరఁగ నిన్ను నీశునకుఁగూర్చి గృహస్థ ఫలంబునొంది త
ద్వారిగ నాదు పూర్వభవభవ్యంబున నంచుఁ బల్కియున్.

మునిబృందోత్తములార! యీశ్వర సతీపుణ్యాంగనా రత్నమున్
బ్రణతుల్ సేసి భక్తిపురస్సరంబుగ నొనర్పంబూనె నాశీస్సులిం
డని యద్రీశుఁడు మౌనిసత్తములతోడం బల్క నాత్మేప్సితా
ర్థనయ ప్రౌఢినిఁ బల్కు నాతనిని వారల్ మెచ్చిరత్యంతమున్.

అమ్ముని మండలమ్మున గజాత్మజ భావిశుభోదయానుకూ
లమ్ముగ దీవనమ్ములిడె, లజ్జిత భూరిమనోజ్ఞయై, కపో
లమ్ములఁ గంకణమ్ములు గరమ్ముగఁ దాండవమాడ నొప్ప మో
దమ్మునయున్న పార్వతిని దాపుకు గైకొనె మౌనిపత్నియున్.

కూరిమి నంకసీమపయిఁ గూర్చొనఁజేసి యొసంగి దీవనల్
జేరఁగ ముద్దులాడి నునుజెక్కుల నిక్కపు మక్కువంబుతో,
నూరటలేక నేత్రజలమొల్కఁగ దుఃఖిలు మేనకాసతి
న్నారసి యీశు సద్గుణములన్నిటి దెల్పి ప్రశాంతి నిల్పఁగన్.

తన కూఁతుం బరమేశు కిత్తునని చిత్తంబందు నిశ్శంకగా
మనవింజేసె నగేశుడమ్మునులకున్, మాన్యాత్మలవ్వారలం
తన హర్షించియు నాత్మలందపుడె యుద్యల్లగ్న యోగ్యప్రభా
దినమున్ జెప్పి నతండు హర్షఘనవార్ధిన్ మగ్నుఁడై యొప్పఁగన్.

పావనుఁడా నగేశుని సపర్యలనందియు వీడుకొల్పియున్
నా విషకంఠువాస మురయమ్మునఁ జేరియుఁ గార్యసిద్ధులన్
భావజవైరికిం దెలిపి, భవ్యదశానతిఁ బొంది శర్వసం
భావన యుక్తులౌచు నిజవాసముచేరిరి వారలంతటన్.

ఘనతపోధనులమ్మహామునుల నుడులఁ
జేరి వినిన యయ్యర్ధేందు శేఖరుండు
గిరి దుహితృకరగ్రహణ కాతురతఁబడుచుఁ
గల్పములవలె దినముల గడుపుచుండె,

పంచశరశాసనుండైన పరమశివుని
నింద్రియములటు మిన్న బాధింపుచున్న,
నమితసామాన్యులైయున్న యవనిజనుల
గలఁతఁ గావింపుచో వింతగలదె సుంత?

[ఆంధ్రీకృత కుమారసంభవము నుండి]

# స్వీకారం

"రాఘవ"

(గత సంచిక తరువాయి)

"ఎందుకూ సావిత్రీ అలా యేడుస్తావ్?" అని అడిగాడు తెలియకనే. సావిత్రి ఒక్కంతసేపూ వూరుకొని, "నా ప్రారబ్ధాన్ని తల్చుకొంటుంటే యేడుపు రాక నవ్వు యెలావస్తుంది బావా!" అంది కళ్ళల్లోకి సూటిగా చూస్తూ తుడ్చుకొంటూ.

"నువ్వు మునుపటిలాగా యేంమాట్లాడ్డంలేదు. అంతా కొత్తగావుంది. ఎలాగైనా పెళ్ళి అయిన తరువాత ఆడవాళ్లు వూరికే మారిపోతుంటారు. అవునా సావిత్రీ!" అని ప్రశ్నించాడు.

"బావా! యిప్పుడవన్నీ తల్చుకొని యేమిటీ ప్రయోజనం? నా జీవితం, నమ్ముకొన్నవాళ్ళందరివల్లా మోసపోయింది. నేను మునుపటి సావిత్రిలా బ్రతకటంలేదు. నాలో సంతోషంలేదు. తీయని కోరికలంటూ యేవీలేవు. కాని, నిన్ను చూసేసరికి, జీవితానికి ఆశఅంటూ ఒకటి లేకపోయే పక్షంలో, ప్రయోజనమేమీ లేదనిపిస్తోంది. యింతవరకూ నాపట్ల నువ్వెల ప్రవర్తించావో నాకెందుకూ? యిప్పుడు. ఆ రోజుల్లో నీకు నేనూ, నాకు నువ్వూ ఎంతో దగ్గరగా వుంటూవచ్చాం, హృదయాలు రెంటినీ యేకం చేసుకున్నా మనుకున్నాను. నువ్వు తప్పకుండా నావాడివైపోతావనీ ఆశించాను. కానీ, నా ప్రారబ్ధం యీ గతికి తెచ్చింది, అన్నట్టు — ఇల్లారిసుంచేనా, బావా! రావటం?"

"అవును, సావిత్రీ బెజవాడకు మార్చారు. రేపు వెళ్ళి చార్జీ పుచ్చుకోవాలి. యీ విషయాన్నిగురించే చెప్పి పోదామని గుంటూరులో ఆగినప్పుడు మామయ్య కనిపించినప్పుడు చెప్పాను. యింతలో నువ్వు కనిపించావ్, చూసీ చాలారోజులైందిగదా! పలకరించి వద్దామని యిందులో యెక్కాను. బహుశా! మామయ్యకీమాదిరి నా ప్రవర్తన నచ్చకేనేమో, మంగళగిరిలో దిగి యింకో పెట్టిలో యెక్కాడూ" అన్నాడు, మురారి.

"అదేమీ కాదు బావా! నువ్వలా నాన్నని అపార్థం చేసుకోకు. ఆయనలా వెళ్ళిపోవటం, మనిద్దరికీ మంచి అవకాశం యిచ్చినట్లన్నమాట. ఆయన నాకు కర్మవశాత్తూ 'నాన్న' అయినాడు. కానీ యేంలాభం బావా! చెప్పకుంటే సిగ్గుచేటు, బామ్మ, నాన్నా, కలిసి నన్ను ఒక దుర్మార్గునికిచ్చి వివాహం చేసారు. సూత్రం కట్టిన లగాయితూ, సుఖం అనే పదానికి అర్థమేమిటో యింతవరకూ తెలియదు. తెలుసుకోవాలని ఎంతో ప్రయత్నించాను. విఫలురాలినైనాను. పరాయి సంబంధం వొద్దో, మొర్రో అని బంధువులంటున్నా, వినక, బామ్మా నాన్నలు కలిసి నన్నిలా నట్టేట్లో ముంచారు. వూరినిండా అప్పులు పాపం పెరిగినట్లు పెరిగివున్నయి. మా అత్తగారు ఎంతో మంచిది. కాని యేంలాభం. ఉబ్బసపురోగి. చూపు కనబడదు. చెముడు. యిలాంటి స్థితిగతిలో కూడా భర్త సహకారం లేకపోగా, పలకరింపు కూడా లేదు. చివరకు నాజీవితం, నీతిరస్కారంవల్ల, మా అమ్మ మౌనంవల్ల, యీగతికి వచ్చింది." అని మురారి హృదయాన్ని బిగిసిపట్టి వూపేసినట్లు మాట్లాడుతుండగా బెజవాడ స్టేషన్‌లోకి వచ్చి బండి ఆగింది. అంతవరకూ అశ్రుపూరితాలైన కళ్ళని తుడుచుకొని.

"ఇక దిగిపోతావుగా బావా!" అంది దీనవదనంతో బేలగా. మురారి దిగుతూ, "అమ్మా వాళ్ళని అడిగానని చెప్పు సావిత్రీ! వీలైతే ఒకసారి వచ్చి, చూసిపెడతానని అమ్మతో చెప్పు. పండగ వెళ్ళేదాకా వుంటావుగా! తప్పకుండా వస్తానని చెప్పు" అన్నాడు.

"నువ్వు రాదల్చుకుంటే నేనుండగానే రావటం మంచిది." అని జవాబిస్తుండగా సీతాపతి దూరం నుంచి గబగబా వస్తూ, తన సామాన్ను దింపించుకుంటానికి వెళ్ళే మురారికి యెదురై, క్రోధారుణ నేత్రాలతో చూస్తూ, పళ్ళు పటపట కొరికి, సావిత్రివైపు

కొచ్చి సామానుని దింపించుకొని, కారులో వెళ్లిపోదా మనుకున్నాడు గన్నవరంకి. అప్పటికి సావిత్రి మెల్లగా దిగి, వెళ్లిపోతున్న మురారివైపుకి నిశ్చల నిరీహ నేత్రాలతో చూస్తూ నిల్చుంది. ప్లాటుఫారం మీద.

సీతాపతి వచ్చీ రావటంతోనే, సావిత్రిని మాడ కుండానే, సామాను కూలినెత్తికెత్తిస్తూ, "యిక చూడటం చాలు. బయలుదేరి ముందడుగెయ్యి. అవతల కారు నందుకోవాలి. యెల్లకాలమూ అతను మనవాళ్లులాగే వుంటారా! గుంటూరులో ఎక్కిన దగ్గరనుంచి చూడటం మొదలెట్టినా, యింకాపూర్తి కాలేదన్నమాట! యేమిటీ నీకింత పిచ్చితరహా అబ్బింది. పెళ్లయినదానివి అలా ప్రవర్తించవచ్చునా! చూసేవాళ్లేమనుకుంటారన్న సిగ్గయినా లేదే." అంటూ స్టేషను దాటి రిక్షా యెక్కి, బెసెంట్ రోడ్ సెంటర్లో వేంకటేశ్వర మోటార్ సర్వీస్, మాని కొండ అనే బస్సుయెక్కేదాకా సీతాపతి సావిత్రిని నానా మాటలూ అసభ్యంగా అంటూనే వచ్చాడు. కూతురనీ అభిమానంకూడా వుంచకుండా పలురకాలుగా సతాయిస్తూ వచ్చాడు. పైగా మురారిని మధ్య మధ్య 'దుర్మార్గుడనీ, నీచుడనీ, దిక్కుమాలినవాడనీ, సభ్యత తెలియనివాడనీ', వగైరా మాటలంటూ సావిత్రికి నీతులు నేర్పటం మొదలెట్టాడు. తండ్రి వుద్దేశ్యాన్ని గ్రహించేసరికి సావిత్రికి వొళ్లు మండింది. యింకా అప్పటికి బస్సు కదల్లేదు. ఎవ్వరూ తన మాటలు వినటంలేదుగదా అనేభావంతో సావిత్రి, నెమ్మదిగా తండ్రిముఖంవంక చూస్తూ,

"మురారి బావ యిలాంటివాడని క్షుణ్ణంగా తెలిసి వున్నప్పుడు, గుంటూరు స్టేషన్, ప్లాటుఫారంమీద నిలబడి, అంతసేపు యేమి విషయాలు వున్నయ్యని మాట్లాడావ్?" అంది. సీతాపతి ముఖం ఆ పాళాన చిన్నబోతూ వుండటమే కాకుండా, వెలవెల కూడా పోయింది. ఉన్నట్టుండి సావిత్రి, తన కూతురు యీ విధంగా అదునుచూసి ఎదురుదెబ్బ కొడుతుందని, పాపం! ఆ తెలివితక్కువ మానవుడైన సీతాపతి వూహగానైనా అనుకోలేదు. వెంటనే నోరుమూసుకొని, చీకటి పడుతూ పడుతూండగా గన్నవరం చేరుకున్నారు.

దసరాపండుగ యింకామూడురోజులు వుందనగా మురారి తన వుద్యోగానికి చార్జి పుచ్చుకున్నాడు. పండుగ వెళ్లిన వారంరోజులకు సీతాపతి మీద, అలనాడు సావిత్రి పెళ్లిలో, "కట్నం యిచ్చిన సీతాపతిని, పుచ్చుకొన్న రమణమూర్తిని యేంచేస్తానో చూడు. కోర్టుకెక్కించి మరీ యేడిపిస్తాను. చట్టానికి వ్యతిరేకంగా నడిచి, సర్కారువార్ని మోసంచేస్తారా! చూడుమరి నా తడాఖా యేమిటో" అని మీసం మెలివేసిన, మురారి బంధువు ప్రసాదరావు దావా వేసి, నోటీసు పంపేలాగు చేసాడు. మరో వారం గడవకముందే గుంటూరునుంచి రమణమూర్తి వ్రాసిన పదిహేను నయాపైసలు కవరువచ్చి సావిత్రిని కల్లోల పరిచింది.

"ఇప్పుడేమిచేయటమా! కర్తవ్యం" అని సీతాపతీ, కాంతమ్మ గుసగుసలాడుకోలేక మధనపడుతున్నారు. "మీ ఆయన వ్రాసిన వుత్తరంయేమిటీ! ఎందుకే అలా వూరికే యేడుస్తావ్! ఏంజరిగిందే! చెప్పవే! మా అమ్మగా యేడవకే! యేమనివ్రాసారే! చెప్పవే. నాకేమిటో భయంగావుంది. రాత్రికూడా యేదో పీడకల వచ్చిందే! యేమిటో ఆ వుత్తరం కాస్త చూసి చదవ్వే. వినేదాకా కంగారుగావుంది" అంటూ పార్వతి గుండెలు బాదుకుంటూ ఏడవ సాగింది.

మొత్తానికి ప్రసాదరావు యే వేళప్పుడు, యెలాంటి గొప్ప వకీలునిబట్టి దావా వేశాడోగాని, మహా పెద్ద చిక్కు తీసుకొచ్చి పెట్టాడుతల్లీ, కొడుకులైన కాంతమ్మకీ సీతాపతికీనూ. అక్కణ్ణుంచి యిరువురూ మతులు పోయేటట్లు తర్జనభర్జన చేయటం సాగించారు. కూడూ, నీళ్ళూకూడామాని చెవులుకొరుక్కోలేక తెగ అవస్థపడటం మొదలెట్టారు. ఎలాగో కాంతమ్మ వత్తాసుమీద నోటీసు అందినట్లు, పుచ్చుకున్నట్లు, సంతకంచేసి పంపాడు సీతాపతి. మిగతా వ్యవహారం యెలా పరిష్కరించుకోవాలో తెలియక తమలో తాము గ్రుద్దుకులాడుకోవటం యెక్కువైంది. ప్రసాద రావు యెంత అసాధ్యుడైందీ అప్పటికిగానీ తెలిసిరా లేదు వాళ్లకి. "సాహసించి దావాలో గెలుద్దామా! డబ్బుకావాలి. ఏదో తీరా అప్పుతెచ్చి వ్యవహారం లోకి దిగుతామే అనుకో, గెలుస్తామని నమ్మకం యేమిటీ? యిప్పటికే సావిత్రి పెళ్ళికి తెచ్చిన అప్పు తాలూకు రెండువేలూ యింకా తీర్చటమే జరగలేదు. మళ్లీ ఒక వెయ్యో, రెండువేలో కావాలంటే అద్దంతరంగా ఎవరిస్తారూ? ఎలా యీ దావాని ఎదుర్కోనేది?" యిలా సీతాపతి హోరాహోరిగా ఆలోచించటమే జరుగుతోంది, గాని, అసలుపనికి పూనుకో లేక పోతున్నాడు. కాంతమ్మమాత్రం సీతాపతిని

గోడమీద పిల్లి నాటకంగా ప్రవర్తించమని వుద్బోధిస్తూ, మధ్య మధ్యా కాటికి కాళ్లుసాచిన మాటలు మాట్లాడటం మొదలుబెట్టింది. సీతాపతికి దిక్కుతోచక, కాలుగాలిన పిల్లిలాగా, దారంతెగిన గాలిపటంలాగా, తికమకలు పడసాగాడు. అటూ యిటూ ఆదుర్దాతో తిరుగుతూండటం ప్రారంభించాడు. సరిగ్గా యీ సమయంలో యేంజరిగితే బాగుంటుందో అదే జరిగి వూరుకొంది. దొడ్లో, సావిత్రిని కౌగలించుకొని పార్వతి శోకన్నాలు పెడుతోంది బిగ్గర బిగ్గరగా. సావిత్రి కుపిత హృదయంతో, తన ప్రారబ్ధాన్ని పదేపదే తల్చుకుంటూ రమణమూర్తికోసం కాకపోయినా, అతని దారుణ చర్యకి విలవిలా తన్నుకుంటూ ఏడవసాగింది.

తల్లీకూతుళ్ల యేడుపెందుకా అని సీతాపతి, కాంతమ్మ మాట్లాడుకుంటూ వున్నవాళ్లల్లా దిగ్గునలేచి దొడ్లోకి వెళ్ళి, ఆదరాబాదరాగా 'యేమిటేమిటీ ?' అని ప్రశ్నించారు. పార్వతి గుండెలు బాదుకొంటూ, సావిత్రిని కౌగలించుకొని, నేలమీద పడివున్న వుత్తరాన్ని సీతాపతికి చూపింది. అతను వెంటనే మడత లిప్పి చదవటం ప్రారంభించాడు, గబగబా, వడివడిగా—

చి|| సౌ|| సావిత్రికి,

రమణమూర్తి ఆఖరి ఆశీర్వాదములు.

నా యీ వుత్తరం నీ కందేసరికి, బహుశా ! చనిపోయే వుంటాను. ఎందుకు చనిపోయానూ ? అన్నదానికి నీవుమాత్రం కారణంగాదు. ముమ్మాటికీ నేనే. నేను జీవితంలో అన్నివిధాలా పతితుణ్ణి. కారణాలు అనేకం. అగ్నిసాక్షిగా కడుతూ మంగళసూత్రం, 'నాతిచరామి' అన్ననాటినుంచీ మనసిచ్చి యేనాడూ నీతో సుఖంగా కాలక్షేపంచెయ్యలేక పోయాను. నేను చెడుగా తిరగటంవల్ల నాశరీరం పూర్తిగా చెడిపోయింది. అందువల్లనే, నాస్వార్థం కోసం నిన్ను కాంక్షించలేక, విరహబాధలో ప్రేల్చాను. నేను చెడిందిగాక, నిన్నూ చెరపటం, భావ్యంగాదనే వుద్దేశ్యంతో, నిన్ను సంసార జీవితంలో సుఖపర్చలేక పోయాను. నా మనస్సులో వున్న యీ రహస్యాన్ని యెలాగైనా సరే నీతో చెప్పాలని యెన్ని పర్యాయములో ప్రయత్నించి విఫలుణ్ణయినాను. సాహసించలేక పోయాను. చెప్పటానికి యేవిధంగానూ ముఖం చెల్లిందిగాదు. తీరా చెపితే యే అఘాయిత్యం చేసుకొంటావో అనే అనుమానంకొద్దీ చెప్పటానికి నోరురాలేదు. యిది యిలా వుండగా, నువ్వు మనస్ఫూర్తిగా, 'మురారి'ని ప్రేమించి, పెళ్ళిచేసుకోలేకపోయావనే విషయం, మన పెళ్లిలో కర్ణాకర్ణికగా విన్నాను. తరువాత, ఒకనాడు నీ పెట్టిలో, బట్టల అడుగున వున్న అతని ఫోటో చూడటం జరిగింది. దాంతో నువ్వు నా భార్యవు గాదని, ప్రారబ్ధవశాత్తు నాకు భార్యవైనావని రూఢి చేసుకొని పరితపించాను. మీ ప్రేమికులజంటను, తెలుసుకోకుండా విడదీసినందుకు నేనీ శిక్షను అనుభవించబోవటం సర్వవిధాలా సముచితమనిపించింది.

పోతే యింకా మిగిలివున్న విషయాలు చాలా వున్నయి. కొన్ని వ్రాసి తెలియపరుస్తాను. మాఅమ్మ వుబ్బసపురోగి. అప్పుచేసి యెన్నోమందు లిప్పించాను. ప్రయోజనం లేకపోయింది. నా పెద్దనాన్నమాటవిని మీ నాన్నదగ్గర, కట్నం పుచ్చుకున్నాను. యిది సర్కారువారు చేసిన చట్టానికి విరుద్ధమని, యెవరో, మీ బంధువనుకుంటాను, అతను దావావేసి, నాకు నోటీసు యిప్పించాడు యీమధ్య. నా పాపం యీ తఫాతో పరిపక్వదశకు వచ్చిందని నమ్ముకొని జీవితాన్ని చాలించవలెననిపించింది. లేకపోతే, యింకా యెక్కడనీ అప్పుతెచ్చి దావాను ఎదుర్కోను. అమ్మని బ్రతికించుకోను. నిన్ను యెంతకాలమని యీవిధంగా యేడిపించను. యివన్నీ నామూలంగా యేర్పడినవేగా! యిదంతా నా ప్రారబ్ధమేగా! కాబట్టి, సావిత్రీ ! నాగురించి, భర్తను కాబట్టి, ఒక్కసారి తృప్తిగా యేడ్చి, గుండెను రాయిచేసుకొని వుండిపో. ! ఇదే నా చివరిమాట.

—'రమణమూర్తి'

అని సీతాపతి పూర్తిచేసేసరికి జీవితంమీద విరక్తి జనించింది. ఒకవైపు కాంతమ్మ, 'ఏమిటిరా అది?' అని ప్రశ్నించింది. సీతాపతి కళ్లు అమాంతంగా చెమ్మగిల్లినయి. కంఠం బొంగురు పోయింది. యేమని చెప్పాలో తెలియక, వణుకుతూన్న పెదిమలతో.

(సశేషము)

# పెళ్ళి చూ (త్రా) పులు

శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రం



"జయా!"—అమ్మ పిలుపు విని తుళ్ళిపడింది జయ.

"అవతల పెళ్ళివారు తొందరపడుతున్నారమ్మా పిల్లను చూస్తామంటూ. మీ నాన్నగారసలే ఖంగారు మనుషులు. మరీ ఆఘమేఘాలమీద పరుగు పెడుతున్నారు. పెళ్ళికూతురు అలంకరించుకునేందుకు కాస్తైనా సావకాశముండాలనుకోరు. వేగంగా ముస్తాబుకామ్మా" అంటూ సుందరమ్మగారు జయని బుజ్జగిస్తూ సమీపించింది.

అద్దంలోకి ముఖం చూసుకుంటూ అలాగే ఉండిపోయింది జయ. అర్జంటుగ పిల్చుకొచ్చారు పెళ్ళిచూపులకని కాస్లు మధ్యలో. 'ఇష్టమున్నా లేకపోయినా తన విధి తను నెరవేర్చాలి. వేరే ఏం ముస్తాబవాలి? హిందూ ధర్మపవిత్రతకు చిహ్నంగా తన వంటిమీద వెన్నముద్దలాటి శ్వేత వస్త్రము, మంగళప్రదమైన గాజులు కుడిచేతి కుండనేఉన్నై. కాకపోతే ఎడంచేతి రిస్ట్‌వాచి తీసి రెండుగాజు లేసుకుని నొసటను మాత్రం కొంచం కుంకం అద్దుకుంటే సరి! పదహారణాల అమ్మాయిలా తయారవచ్చు!' ఆమె ఆలోచనలొక కొలిక్కి రాకుండానే సుందరమ్మగారామెను తొందరపెట్టేరు. 'అదేంటి జయా! ఇంకా అలాగే ఉన్నావ్, ఆ బెనారస్ సిల్కుచీరా, ఆ పట్టురవికా తొడుక్కొని చక్కగా ముఖం కడుక్కొని బొట్టు పెట్టుకుని పెళ్ళికూతురులా తయారవకుండా!'

జయ యీలోకంలోకి వచ్చింది. 'అమ్మా నువ్వు చెప్పినట్లు తయారవటానికి అధమం ఒక గంటేనా పడుతుంది. మరీ అవతలవాళ్లు తొందరపడుతున్నారంటావ్. ఏం ఈ తెల్లచీర బాగులేదూ? కాకపోతే శిగచుట్టుకోవటంచూస్తే నర్సులా ఉందనుకొంటారు. నిజంగా మెడిసన్ ఎలాగు చదువుతున్నాను. నాకు నూటయే దీ డ్రస్సే. ఇందులోనే కావాలంటే వాళ్ళకి కనపడతాను. అంతేకాని సీతామహాలక్ష్మిలా తయారవలేను సుమా! బట్టలుమారితేమాత్రం మనిషి మారిపోతారుటే అమ్మా!' జయ మాటల్లో వైరాగ్యం తొణికింది. తనకి పెళ్ళయేవిధం ఉంటే యీ అలంకరణేమీ అడ్డురాదన్నభావం ఆ మాటల్లో దాగుంది.

సుందరమ్మ పరిస్థితిమాత్రం అధ్వాన్నంగా ఉంది. కూతురుకి వైరాగ్యభావం పోగొట్టి అచ్చం పెళ్ళికూతురిలా తయారుచేయకపోతే, అవతలివారీమె డాక్టర్ దుస్తులు చూస్తేమనుకుంటారో? భర్తచూస్తే అమ్మాయిని త్వరగా పంపమని ఉరుకులూపరుగులూ— పచ్చివెలక్కాయ గొంతులో దిగినట్టుందామెకు. ఇంతలో భర్త పిలవనే పిలిచాడు 'వేగంగా జయని తీసుకురావే!'. అది పిలుపులా లేదు. ఏదో కొంప మునిగిపోతూంటే వేసిన కేక—ఆమె తన చికాకంతా జయమీద చూపించింది.

'నీ యిష్టం తల్లీ! నర్సు డ్రస్సులోనే పెళ్లిచూపులకెడతావో, దొరసాని డ్రస్‌లోనే వెడతావో! మీ నాన్నగారు నన్నింకా తిట్టకుండా వేగంగా నువ్వు నీ యిష్టంవచ్చిన డ్రెస్‌లోనే కనబడిరా. అదృష్టముంటే సరి!'

'పరవాలేదమ్మా! యీ పద్ధతి తప్పేంకాదమ్మా! పైపెచ్చు స్వచ్ఛతకి, సహాయశీలానికీ చిహ్నం తెలుసా!' అంటూండగా నాన్నగారు లోపలికొచ్చి 'పదపద జయా! వాళ్ళకింకా ఏవో పనులున్నాయట' అంటూ ఆమెను తీసుకెళ్లేరు.

మెల్లగా నడచివస్తూన్న జయని చూచి పెళ్ళికొడుకు తండ్రి కాబోలు 'రామ్మా! కూర్చో!' అంటూ ఆహ్వానించేడు. 'పరవాలే' దనుకుంది జయ.

ఫలహారాలు సేవిస్తూ ప్రశ్నలు విసరటం మొదలెట్టేరు. 'అమ్మాయ్ ఏం చదువుతూంది?'

'మెడిసినండీ'—నాన్నగారి కంఠం గర్వంగా మెల్లగా.

'ఆ అమ్మాయి వాలమూ దుస్తులూ చెప్పకనే చెప్తున్నాయ్!' ఎవరిదీరిమార్కు! అనుకుని క్రీగంట చూసింది. అంత ధైర్యశాలినీ, బుద్ధిమంతుణ్ని నేనే సుమా! అన్నట్లు చూసిన పెళ్లికొడుకు తత్వాన్ని ముందుగానే పసిగట్టింది జయ. ఏమైనా యీ సంబంధం తప్పించు భగవాన్! అనుకుని మొక్కుకుంది మనసులో. అయినా యీ దోషిని అనుగ్రహించటానికి నిరాకరించటానికి అధికారులు వాళ్లు కదూ! అనుకుని అసహ్యంగా వారివేపు చూచింది.

ఆమె తలపుల్లో, వారి నోటినుంచి వచ్చేమాటలు కొన్ని వినలేకపోయింది. ఆమె వాస్తవంలోకి వచ్చేటప్పటికి వారి కొస మాటలు వినపడ్డాయ్. 'అమ్మాయి విద్యావంతురాలవాలని కోరుకున్నమాట వాస్తవమే కాని, ఆమె మగరాయుడులా ఉద్యోగం చేసి, గృహిణీ ధర్మం తిరస్కరించాలని మాఅభిలాష కాదండీ! ఈమె వేషభాషలు చూడగానే మాఅబ్బాయితో కాపురం చేయటానికి సరిపోయేలా అనిపించటం లేదు. క్షమించండి వస్తాం. ఆమెను బాగా చదివించి లేడీ డాక్టర్ గాచేస్తే ఆమె ఎంతేనా రాణిస్తుంది, మరి సెలవిప్పించం'డంటూ తెగదిన్నామన్న కృతజ్ఞతేనా లేకుండా నిర్మొహమాటంగా జయ మీద తమకుసర్వాధికారాలున్నట్లు ఎగతాళిగమాట్లాడి పెళ్లివారెళ్ళిపోయారు. వాళ్ళ మాటలుమాత్రం వీళ్ళ హృదయాలలోంచి వెళ్ళిపోకుండా జయనూ నాన్ననూ కాలుస్తూనే ఉన్నై. నాన్న తన చికాకంతా అమ్మమీద చూపబోతూంటే జయ అంది, "ఎందుకు నాన్నా బాధపడతావ్! లేకి మనుషులు. వాళ్ల స్వభావం అంతే. ఎదుటివారి హృదయం కనిపెట్టలేని ఆ మూర్ఖులమధ్యపడకుండా ఉండటమే నా అదృష్టం!"

నాన్న కొంచెం శాంతించి మెల్లగా అన్నాడు. అయినా అమ్మాయ్, "నువ్వలా నర్స్‌లాతయారయి పెళ్ళి చూపులకి రావటం బాగుండలేదమ్మా!"

జయ కొంచెం దెబ్బతింది. నాన్నకూడ అలాగే ఆలోచిస్తున్నాడా! మనిషి విలువలు మనిషిలో కాకుండా ఆమనిషి ధరించే దుస్తులలో ఉంటాయా? ఆమె అయిష్టంగా అంది "ఇకమీదట మామూలుగ తయారవుతా నాన్నా!" జయ బాధగా అక్కడి నుంచి కదిలింది. పెళ్ళివారిమాటలూ, నాన్న మాటలూ ఆమె హృదయంలో గాయపరచినవి. అది మానాలంటే ఎంతకాలమేనా పట్టొచ్చు!

తరువాతనుంచీ జయ మామూలుగా కాలేజీకి వెళ్తూనే ఉంది. రెండు నెలలవరకూ పెళ్ళివారిపేరిట తనని కల్యపరీక్షచేసి హృదయం గాయపరచటానికెవరూ రాకపోవటం చూసి మనసులో నిట్టూర్పు విడచింది—ఆ రాబందుల కళ్లల్లోంచి తప్పిపోయాం గదా అని.

కాని ఆమె ఊహలు ఫెయిలయ్యాయ్. ఆనాడు తొమ్మిది గంటలకు కాలేజీకి బయలుదేర బోతూంటే అమ్మ అంది. "జయా! త్వరగా రామ్మా! సాయంత్రం ఐదుగంటలకి నిన్ను చూసుకుందుకు తుని నుంచి పెళ్ళివారొస్తారు!" ఆ మాటలు వింటూంటే జయకు కాళ్లు వణికేయ్. 'హే భగవాన్! నేనెవర్ని కష్టపెట్టేనయ్యా యిలా బాధిస్తున్నావ్. యీ రోజెవరి ముఖం చూసేనోగాని. హు! వచ్చే పెళ్ళికొడుకు తనని చేసుకోపోయినా బాధలేదుగాని తన హృదయం గాయపడే హాస్య బాణాలు విసరకపోతే చాలు!' అనుకుంటూ అప్పట్నించీ యింటిదగ్గర ఉండటం బావుండదని కాలేజీకి నడచింది జయ.

ఆలోచనలు సాగిపోతూంటే లెక్చర్ వృధాగా పోతూందని పశ్చాత్తాప పడుతూనే ఆలోచనల కొనకట్ట వేయలేక వోడిపోతూంది జయ. ఎలాగైతేనేం మార్నింగ్ సెక్షన్ కంప్లీటయింది. మెల్ల మెల్లగా జయ యింటిముఖం పడుతూంటే తోటిఅమ్మాయిలు తలో కారణం ఊహించుకుని జయని ఉడికించబోయారు. వారి మాటల కతీతురాలైనట్లు జయ మౌనంగా యింటికి చేరింది.

ఎదురుగ మంచం, పరుపూ, ఫానునుంచి వచ్చే చల్లగాలీ ఆమెను ఆహ్వానించాయ్. రెండుగంటల కలారంపెట్టి మెల్లగా కనుమూసింది జయ.

రెండుగంటలకు లేచి తల్లితో చెప్పకుండానే స్నానం అదీ చేసింది. తనతీరంతా మారిపోయేలా వాలుజడ వేసుకుంది. లాంగని కురులను సంపంగి నూనెతో లాలించి స్నానంచేస్తూ కొంచెం పసుపుకూడ తగిలించింది ముఖానికి శుభలక్షణమని కాదు కాదు. పెళ్ళివారి బాణాలు పనిచేయకుండా ఉండటానికి. గడియారం మూడుకొట్టేటప్పటికి జయ పూర్తిగ తయారయింది. అమ్మ పెళ్లిచూపులకి కట్టుకున్న నెమిలికంఠం రంగు సిల్కుచీర కట్టుకుంటే తనకేవిజయమే ఉండదనికాబోలు అది కట్టుకుంది. గులాబిరంగు పట్టుజాకెట్టూ, ముఖాన కనపడేంత తిలకమూ, కాళ్లకి అలవాటు లేకపోయినా పైపైన పారాణీ, వేలికి ఉంగరం, చేతికి గాజులూ, కాళ్ళకి పట్టీలూ... యింకా... అన్ని అమ్మ వస్తువులే. అసలు కళ్ళకి కాటుక దట్టంగాపట్టించాలా? అనుకుని అమ్మ వచ్చేవరకూ ఆగుదామనీ అప్పటికే పెళ్లికూతురిలా తయారై కుర్చీలో కూర్చుని జరగబోయేదాన్నిగురించి ఊహించుకుంటూంది.

నాలుగవగానే సుందరమ్మగారు జయగదిలోకివచ్చి ఆమెను చూసి ఆశ్చర్యపోయింది. 'నా బంగారు తల్లివమ్మా! చిలకలా సింగారించుకున్నావ్. అచ్చం

లక్ష్మీదేవిలా ఉన్నావంటే నమ్ము. ఇంకా నిద్ర పోతున్నావేమో లేపాలనుకుంటూ వచ్చేను. కళ్ళకి కొద్దిగా కాటుక పెట్టుకోమ్మా. వాళ్ళూ వస్తారు. ఈలోగా కాఫీ తాగుదూగాని' అంటూ సుందరమ్మ ఆప్యాయంగా జయని తల నిమిరింది. 'ఈ జయని చూస్తూ ఏ పెళ్లికొడుకూ వదలలేడమ్మా!' అనుకుంటూ సుందరమ్మ ఫలహారం చెయ్యటానికని లోపలికి వెళ్ళిపోయింది.

కాటుక పెట్టుకున్న జయ కళ్లలోంచి భయం తొంగిచూస్తూనే ఉంది. నల్లని కాటుకలోంచి కనుపించటంవల్ల ఆ భయం మరికొంచెం హెచ్చు భయంగ కనిపించసాగింది.

ఐదుంపావు అయేసరికి నాన్నగారికి చికాకూ, కేకలు కల్పించకుండా పెళ్లివారికి ఫలహారాలు అవీ సప్లైచేసి కూతుర్ని పంపింది సుందరమ్మ. బెరుకు బెరుకుగా జయ కూర్చోగానే ఉదయించిందో ప్రశ్న. 'అమ్మాయి యేమేనా చదువుకుందా? సంగీతం భరతనాట్యం యిటువంటివాటిలో ఏమేనా ప్రవేశముందా?

మునుపటి ప్రశ్న వినగానే జయకు గతం జ్ఞాపకం వచ్చి తుళ్లిపడింది.

'అమ్మాయి మెడిసిన్ చదువుతూంది. సంగీతం అంటే ఏదో సినిమా సంగీతంతప్ప...?' నీళ్లునమిలాడు నాన్న ఏదో తప్పుచేసినట్లు.

'ఆ అమ్మాయి నిజంగా మెడిసిన్ చదువుతూందా?' పెళ్లికొడుకు వేసిన ప్రశ్నకు వళ్లుమండింది జయకు. కాలేజీనుంచి సర్టిఫికేటు తెచ్చి ముఖాన కొడితే! అనుకుంది. యీ సంబంధమూ తప్పిపోతే అనుకుంది.

నాన్న మెల్లగా అడిగాడు 'ఏంబాబూ అలా అడిగావ్? మా కబద్ధం చెప్పవలసిన అవసరమేముంది?'

'అదేమిటండీ, కళ్లకు కాటుక, వాలుజడ, బనారస్ చీరా, పారాణీ, పసుపూ యివన్నీ వేసుకుని ఏగాన కచేరీకో, భరతనాట్యానికో తయారైనట్లున్న ఈ అమ్మాయి మెడిసిన్ చదువుతూందంటే అనుమానంగ ఉంది. బహుశా యీ అమ్మాయికి యిటు చదువూ, అటూ గృహధర్మం ఏదీ వంటబట్టినట్టు లేదు. చదువుకుంటే చదువుకున్నట్లు మోడరైజ్డ్‌గా ఉండాలి. లేదా యింటిని చక్కబెట్టుకునే సంసారిలాగానేనా ఉండాలి. అంతేగాని ఎందుకండి యీ త్రిశంకు స్వర్గం. ఆమెలోలానే ఆమె నామధేయంలోనూ ఏదో అపరిపూర్ణత స్ఫురిస్తూందండీ! క్షమించండి. వస్తాం' అంటూ పెళ్లికొడుకు సిగ్గూ బిడియం లేకుండా 'రా నాన్నా! నాకీ సంబంధంవద్ద' న్నాడు అచ్చం ఇరవయ్యోశతాబ్దపు రెండవ భాగంలోవాడిలా.

గజగజ వణికిపోయింది జయ. రెండుకళ్లల్లోంచీ రెండు కన్నీటి బొట్లు కాటికమీదుగా కదలజొచ్చాయ్. వాలుజడ వెక్కిరించింది. చీర చిరుబురులాడింది, ఆమె శరీరం మీదుండటంవల్ల తమకూ అవమానం వచ్చిందని. ఆ మహానుభావుణ్ణి చూద్దామని కనులెత్తినా, అటువంటి వాణ్ణి చూస్తే పాపం అన్నట్లు ఆమె కళ్లల్లోని నీరు దృష్టిని బందుచేసింది. కళ్లు తుడుచుకునేటప్పటికి దిగాలుపడుతూ నాన్న! స్వచ్ఛమైన అరచేతిలో నల్లగా కాటుక మరక, ఏమనడానికీ నోరురాక పోయింది జయకు. తన పెళ్ళి మూలంగా నాన్నకూ అవమానాలూ హేళనలూ. ఛీ ఏంబ్రతుకీ అప బ్రతుకనుకుని దిగాలుగా గదిలోకి వెళ్ళి వెక్కి వెక్కి ఏడిచింది. సుందరమ్మగారి సముదాయింపువల్ల లాభంలేక పోయింది.

'నీ కెలాగేనా పెళ్ళవుతుందమ్మా!' ఈసంబంధం కాకపోతే మరొకటి! అంది చివరకు సుందరమ్మ జయ పెళ్ళికోసం బెంగపెట్టుకుందేమో అని. కాని ఆమెకేం తెలుసు జయ విచారమంతా మానవుల అసహ్య ప్రవర్తనకని?

కొసకు జయ ఒక నిర్ణయానికి వచ్చింది. తన ఉద్దేశాలు తారుమారయాయ్. ఒకరి కొకలాగుంటే యిష్టం. మరొకరి కింకోలాగుంటే యిష్టం, తను దురదృష్టవశాత్తు రెండుసార్లూ ఫెయిలయింది. ఏదో ఒక కారణమంటూ రెండు పర్యాయాలూ తను అపజయాన్నే స్వీకరించాల్సి వచ్చింది...ఇక తన జీవితమింతేనా?

అంతలోనే ధైర్యంపుంజుకొంది జయ. ఇటువంటి పెళ్ళిచూ(తూ)పులకి లొంగకుండా, హాయిగ మెడిసిన్ కంప్లీట్‌చేసి డాక్టరవగల్గితే యీబాధల కతీతురాలు కావచ్చును అని నిశ్చయించుకుంది జయ...

కాని తన క్లాస్‌మెట్ మధు తనని వివాహం చేసికొమ్మని మరీమరీ బలవంతంచేయటంవల్లా, తనకూ అతనంటే యిష్టం ఉండటంవల్ల, పెళ్ళితూపుల బారిన పడకుండా, తండ్రి అనుమతితో మధు కౌగిట్లోనే పడింది జయ, రెండు సంవత్సరాల అనంతరం...

# శిశువులు - ఆస్తికత

శ్రీమతి నెమలి చంద్రమతీదేవి



బాలల్లో నాటిన భక్తి బీజమె బ్రతుకు యొక్క భారమును భరించును.

జీవితములోని వడిదుడుకుల కోర్చి, ధైర్యముగాను, శాంతముగాను ముందుకు సాగిపోవాలంటే, శిశువులుగా ఉన్నప్పుడే వాళ్ళకు దేవునియందు, మతమునందు నమ్మకం కలుగజేయాలి. వాళ్ళకు వేళకు పాలు, అన్నం, నిద్ర, ఆటలు, చదువు ఎంత అవసరమో దైవనమ్మిక కూడా అలాగే అవసరం - అంతకన్న ఎక్కువ అవసరమైనది, అతి ముఖ్యమైనదని చెప్పాలి.

భారత, భాగవత రామాయణ కథలు వాళ్ళకు అర్థమగునట్లు చెప్పడం, ప్రతి నిత్యం దేవుని ప్రార్థించడం, ప్రతిరోజు పడుకునేముందు, లేచేముందు ప్రార్థన చేయడం, స్నానముచేసి, దేవుని విగ్రహానికో, పటానికో నమస్కారం చేయటం, వారానికోసారి గుడికి పోవడం, మనం నేర్పించాలి.

రెండేండ్ల బిడ్డ మనం దేవునికి నమస్కారం చేస్తే వెనుకనేవచ్చి తాను నమస్కారం చేస్తుంది. తలిదండ్రులు ఎలా చేస్తే అలాగే పిల్లలు అనుసరిస్తారు. గనుక రెండో ఏటినుండే ఒక నియమం పెట్టాలి, పిల్లలకు. పనులతొందరలో ఉండి, మనం మర్చిపోతాము, లేక పిల్లలందర్నీ బడికి పంపించేసి భర్తను ఆఫీసుకుపంపి, తరువాత మనం స్థిమితంగా కూర్చొని ధ్యానము చేసుకుంటాము అనుకొంటాముగాని అది పొరపాటు. పిల్లలకు అంతటితో మతమునందు శ్రద్ధ, నియమం పోతాయి. ఆ బీజాన్ని శ్రద్ధ, ప్రార్థన, నమ్మిక అను నీళ్లు పోస్తూ, అతి జాగ్రత్తగా పెంచుకుంటూ రావాలి. పిల్లల దేహసంరక్షణతోపాటు వారల మనో సంరక్షణ, ఆత్మసంగక్షణ కూడా అత్యంత అవసరం.

ఈ కాలపు పిల్లలకు కొందరికి, ఎక్కువ చదువు ఉన్నవారికి కూడా, పూర్వాచారాలని, మూఢాచారాలని, మతమునందు నమ్మకము లేకుండా పోతున్నది. ఈ ఆచారాలన్నీ నమ్మాలా వద్దా? విగ్రహ పూజ చేయాలా వద్దా? అది చేస్తే ఏమివస్తుంది? అసలు దేవుడున్నాడా, లేడా? ఎక్కడున్నాడు? ఈ సంశయాలన్నీ వాళ్ళ మనసుల్లో బయల్దేరుతాయి. బి. ఏ., ఎమ్మేలు ప్యాసుచేసినా, ఈ సమస్య తీరేదికాదు. వీటికి ప్రత్యుత్తరాలు చదువులో లేవు. చిన్ననాడు వాళ్ళకు సరైన పునాది వెయ్యలేదు తలిదండ్రులు. మూఢనమ్మకం లేదు, పోయింది. గుడికిపోతే ఎవరైనా నవ్వుతారేమో. పూజచేస్తున్నా, ప్రార్థిస్తున్నా ఎవరైనా చూస్తారేమోనని సిగ్గు, భయమూను, వాళ్ళకు క్రమేపి నమ్మకంకూడా పోతుంది.

ఇటువంటి వాళ్ళకు ఏదైనా కష్టమొచ్చినప్పుడుగాని, వ్యాధి కలిగినప్పుడుగానీ వాటిని ఎదుర్కోడానికి ధైర్యము, శాంతము లేక పిరికివారై కొందరు ఆత్మహత్యకు కూడా దారితీయుచున్నారు. కొందరు మనసు సమర్థించుకునే శక్తిలేక, మతులు కూడా

భ్రమించిపోతున్నాయి. వార్తాపత్రికల్లో తరచు మనం చూస్తూనే ఉంటాము. పరీక్ష తప్పి పోయినదనో, ఉద్యోగము దొరక లేదనో, ఏ వేవో కష్టములు వచ్చి నప్పుడు రైలుక్రిందపడో, ఏట్లోదూకో, పైనుండి దూకో నిండుప్రాణాలు పోగొట్టు కుంటున్నట్లు వింటూనే ఉంటాము. వీటికి కారణం? బాల్యమునందు దైవ నమ్మిక లేకపోవడంవల్ల. ఇది ఎలా కలగడం?

ఒక పాశ్చాత్య మతబోధకుడు ఇలా చెప్పాడు:—

నాలుగేండ్ల పసివాడు పడుకుని నిద్ర పోతుంటాడు. రాత్రి హోరుగాలి, జడివాన కురుస్తున్నది. ఒక్క మెరుపు మెరిసి, ధమ ధమ శబ్దంతో పిడుగు పడుతుంది. బాలుడు మేల్కొని, భయపడి 'అమ్మా!' అని అరుస్తూ ఒక్క ఉరుకులో అమ్మ మంచం దగ్గరికిపరుగునవచ్చి, ప్రక్కలోదూరుతాడు ఏడుస్తూ. తల్లి, "ఎందుకు బాబూ భయం, నేనున్నానుగా నీకేమి భయంలేదు" అని బాలుని దగ్గరకు తీసుకొని, ఒళ్లో పడుకో బెట్టుకొని, నిద్దరవచ్చి ప్రక్కన పడుకో బెట్టి కప్పుతుంది. అప్పుడా బాలుడు అమ్మ ప్రక్కన ఉందికదా అన్న ధైర్యంతో పడు కొని నిశ్చింతగా నిద్రపోతాడు.

ఇదే బాలుడు పెద్దవాడవుతాడు. ఒక రోజు రాత్రి కలత నిద్రలోనుంచి మేలు కుంటాడు. అతనికి ఎన్నో ఆలోచనలు, ఏదో చెప్పలేని భయం, ఆందోళన, చీకట్లో చూస్తూ, ఏదేదో ఊహించుకుంటాడు. ఏవో అనుమానాలు, భయం, ఎంత వద్దను కొని త్రోసి పారేసినా ఎట్టెదుట వచ్చి నిల్చుంటాయి. చిన్నబాబునిగా ఉన్నప్పుడు ఎంత భయపడి, పరుగెత్తాడో అదే భయం.

ఇప్పుడు తల్లిదగ్గరికి పరుగెత్తలేడు. తల్లీ లేదు, అయితే తనకు తెలుసు, ఎవరిదగ్గరకు పోవలెనో, ఎవరిని ఆశ్రయించాలో, చిన్న ప్పుడు అమ్మచెప్పిన మాటలు జ్ఞాపకం వచ్చినాయి. ఆపద్బాంధవుడు, శరణాగత రక్షకుడు అయిన ఆ సర్వేశ్వరుని, సంపూర్ణ విశ్వాసంతో శరణు పొందాలి, అర్థించాలి అంతే. క్రీస్తు చెప్పినట్లు "పసిబిడ్డను తల్లి లాలించినట్లు, నేను నిన్ను లాలించె దను." అని అంటే, పసివాళ్ళ మనసులో తల్లి అంటే ఎంత నమ్మికో అటువంటి గాఢ నమ్మిక కావాలని అర్థం. అపుడాతడు "ఓ తండ్రీ నేనేమి చేయను? నాకేదిదిక్కు? ఏమి తోచకుండా వున్నది" అని మొరపెడ తాడు. అపుడా చీకటిలోనుండి, లేక తన హృదయములోనుండి ఒకవాక్కు వినపడు తుంది. తను చిన్నవానిగ ఉన్నప్పుడు విన్న మాటలె అవి, "నా బిడ్డా నీవెందుకు భయ పడుతావు? నేనిక్కడే వున్నాను. భయపడు టకు ఏమియులేదు. నేను సదా సర్వ కాలము నిన్ను చూస్తునే ఉన్నాను. ధైర్య ముగా ఉండుము నాయనా." దానితో వాని మనసుకు అపరిమితశాంతి, ఊరట కలుగుతుంది.

ఎందువల్ల ఆ ధైర్యం వానికి వచ్చిం దంటే, తల్లిమీదవుండే ప్రేమ, విశ్వాసం, దేవునియందు కలిగి వున్నందువల్ల. అదే కావలసినది. ప్రతిఒకరుకూడా ఇలాగనే ఉండవచ్చును. ఆదర్శమైన ప్రేమ, వాత్స ల్యము, భయమును పారద్రోలును.

చాలమందికి మతము, దైవము అంటే నమ్మిక ఉంది. గుడికి పోతాము, రోజూ దేవునికి పూజ చేస్తాము, ప్రార్థన చేస్తాము, అంటారుగాని ఏదో దేవునికి

నిత్యము దీపంపెట్టి, నాలుగు శ్లోకాలు చదివితే అయిపోతుందనుకుంటారు. మొదట్లో అలా అంతమటుకు చేసినా చాలనుకోండి-అదే మనసుకు తృప్తి కలుగుతుంది. కాని అసలు కావలసినది ప్రగాఢమైన నమ్మిక.

దీనికి ఒక నిదర్శనంగా ఒక కథ ఉంది. ఒక గురువు తన శిష్యునికి ఒక నది అవసరంగా దాటవలసిన సందర్భం వచ్చినపుడు (శిష్యునికి ఈత రాదు) గురువు ఒక చీటి మీద ఏదో వ్రాసి, శిష్యుని దగ్గర ఇచ్చి, ఇది చేతిలో పట్టుకొనిన నదిమీద నడచి పోగలవని చెప్పినాడు. అలాగే నడచి సగంనది దాటాడు. అప్పుడా చీటిలో ఏముందో చూడాలని బుద్ధిపుట్టిందతనికి. విప్పిచూచాడు. రామనామం వ్రాసిఉంది. 'ఇంతేనా!' అనుకున్నాడు. అంతే సగంలో నీటిలో బుడుంగున మునిగిపోయాడు. గనుక అంతా నమ్మకంలో ఉంది. గాఢనమ్మకం కావాలి, ధృడవిశ్వాసం కావాలి.

ఇంతటి ధృడమైన దైవ నమ్మిక కలగడానికి, చిన్నవయసునుండే వారలకు తలిదండ్రులు, ఉపాధ్యాయులు మతబోధలు, భక్తులను గురించి చరిత్రలు చెవుతూ ఉండాలి. నీతి ప్రవర్తన, సత్యప్రవర్తన, ఏది చెడుగో, ఏది మంచో తెలుసుకుని, అవినీతి, అధర్మం, అన్యాయం వదిలిపెట్టి, నిష్కళంకమైన జీవితము గడిపేటట్లు చేయాలి.

పిల్లలకు ఇంకో సమస్య ఎదురౌతుంది. ఏ దేవుని ప్రార్థించడం? ఇంతమంది దేవుళ్లు దేవతలు వున్నారుకదా. రాముడు, కృష్ణుడు విష్ణు, శివుడు, లక్ష్మి, సరస్వతి, పార్వతి-ఇంకా ఎంతోమంది ఉన్నారు. ఎవరిని ప్రార్థించటం? అని, అప్పుడు వారివారి ఇలవేల్పు అని ఒక దేవుడుంటాడు. ఆ దేవుని ధ్యానించాలని చెప్పాలిగాని మొత్తానికన్ని దేవుళ్లు ఒకటేనని, ఎవరికి పూజచేసినా, ఆ ఒక్క సర్వాంతర్యామిగా వున్న ఒక్క దేవునికే చెందుతుందని - రాముడైనా, కృష్ణుడైనా, ఏసుక్రీస్తు అయినా, అల్లా అయినా అందరు ఒకటేనని, అన్ని మతాలు ఒకటేనని ఆ వయసులో చెప్ప రాదు. ఒక పేరులోనే, ఒక మతంలోనే లేక ఒక పటంలోనే, ఒక విగ్రహంలోనే కాదు భగవంతుడు ఉండటం. ఈ బ్రహ్మాండమే భగవంతుడు, ఈ ప్రకృతిశక్తి అంతా భగవంతుడని, వారల వయసుకు తగినట్లు నేర్పిస్తూ, ఎంతవరకు అర్థంచేసుకోగలరో, అంతవరకూ విశదపరచాలి. వాళ్ళకు అర్థంగాని, నిర్గుణ బ్రహ్మయని, అహం-బ్రహ్మాస్మి, తత్వమసి అన్న గూఢమైన జ్ఞానసత్యము లటుంచవలెను. ఆ లేతమనసులను ఉక్కిరిబిక్కిరి చేయకుండా వాళ్ళ వయసుకు, మనసుకూ తగినవిధంగా మతవిషయములు బోధించాలి. నేటి శిశువులే రేపటి పౌరులు. ప్రతివ్యక్తి ఆత్మవిచారణకు పూనుకోవాలి. ప్రతివ్యక్తి ఆత్మపరీక్ష చేసుకొని, తమ తప్పులు దిద్దుకొని, జీవితమును సాగించాలి.

దీనికి బాలల్లోనే మంచిపునాది వేయాలి. బాలల్లో నాటిన భక్తిబీజమె బ్రతుకు, భారమును భరించును. అప్పుడే మనదేశం నైతికంగా ఆర్థికంగా, ఆధ్యాత్మికంగా వృద్ధిచెంది, శాంతియుతమై, అన్ని దేశాలకు ఆదర్శమయి విశ్వశాంతి కలిగించినదగును. అప్పుడే గాంధియుగము ప్రారంభమగును.

# భార్యాభర్తలు

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్సువారి 'భార్యాభర్తలు' చిత్రము ఆంధ్రదేశంలో విడుదల అయి విజయవంతంగా ప్రదర్శించబడుచున్నది.

ఇందలి కథ, సంభాషణలు పొందికగా నున్నవి. ముఖ్యంగా చదువులకని పట్నాలకు వెళ్లే కుర్రవాళ్ళ వింతపోకడలను చిత్రించి కాలాన్ని, ధనాన్ని దుర్వినియోగం చేస్తూ, చదువులపట్ల ఆసక్తిలేకుండా విలాసంగా తిరిగే కుర్రవాళ్ళను హెచ్చరిస్తున్నదీ చిత్రము. ఈనాటి అనేక విద్యార్థులకు కనువిప్పు కలిగించగలదని మా నమ్మకము.

ఆనంద్‌గా నాగేశ్వరరావు, భార్యగా కృష్ణకుమారి, తల్లిదండ్రులుగా నిర్మల, గుమ్మడి, యింకా సూర్యకాంతం, రేలంగి, సంధ్య, రమణారెడ్డి మున్నగువారు నటించారు.

ఈ చిత్రంలో ముఖ్యంగా కృష్ణకుమారి నటన ప్రశంసనీయంగా నున్నది.

నాగేశ్వరరావు నటన పేరొన్నతగినట్లుగా లేకపోగా ఔచిత్యలోపాలు కూడ కనుపించినవి. రేలంగి, రమణారెడ్డి, కుటుంబరావు హాస్యభూమికలను సమర్థతతో నిర్వహించారు. గుమ్మడి, సూర్యకాంతం సహజంగా తమ పాత్రలను పోషించారు. రాజేశ్వరరావుగారి సంగీతం బాగుంది.

ప్రత్యగాత్మ దర్శకత్వము ఆయన చక్కని భవిష్యత్తును సూచించింది.

ఈ చిత్రము సర్వప్రజానీకపు ఆదరాభిమానములకు పాత్రము కాగలదని నిస్సంశయముగా చెప్పవచ్చును. యువకులను, స్త్రీలను ఆకర్షించే సన్నివేశాలు, కథపోకడ, ఇతివృత్తం, సంగీతము చిత్రపు విజయానికెంతైనా తోడ్పడగలవు.

'సిపిసి'

# సంపాదకీయములు

## ఖాదీ అభివృద్ధి - మిల్లులు

ఖాదీ అభివృద్ధి కార్యక్రమాలు ప్రారంభించిన చోట్ల క్రొత్తగా బట్టలమిల్లు పెట్టడానికి లైసెన్సు నివ్వవద్దని కేంద్రప్రభుత్వము రాష్ట్రప్రభుత్వాలకు ఆదేశించిందట.

ఖాదీ పరిశ్రమ అనేకులకు జీవనోపాధిని కలిగించునది. కద్దరు ధారణవల్ల మన జాతీయతను, దేశమును ప్రేమించినవారమే కాక కొందరికి జీవనోపాధిని కలిగించినవార మగుదుము. అంతేకాదు చలికాలంలోను, వేసవికాలంలోనుకూడా మిల్లుగుడ్డ యీయజాలని సుఖాన్ని కద్దరుధారణ కలిగిస్తుంది. కాబట్టే గాంధీజీ ఖాదీ ఉద్యమాన్ని జాతీయ ఉద్యమంగా రూపొందించి తద్వారా జాతీయతపట్ల ఆసక్తిని పెంపుజేశారు. గాంధీ అర్థిక ప్రణాళికలో ఖాదీ పరిశ్రమ ఒక ప్రధాన అంశము. అంతేకాదు కద్దరు పవిత్రతకు, దేశభక్తికి, చిత్తశుద్ధికి చిహ్నమై దానిని ధరించుట యీనాటికి సయితము గర్వకారణముగా నున్నది.

ఇట్టి ఖాదీ పరిశ్రమ ముమ్మాటికి వర్ధిల్లవలసినది. ఖాదీ ఉత్పత్తితో బాటు వినియోగంకూడ వృద్ధికావడానికి మార్గాలను ప్రభుత్వము మరింతగా అన్వేషించాలి. బట్టల మిల్లుల పోటీనుండి ఖాదీనే కాకుండా చేనేత పరిశ్రమనుకూడ రక్షించకలుగాలి. ఖాదీ, చేనేత పరిశ్రమలు గ్రామీణ జీవితంలో అనేకులకు జీవనోపాధిని కలిగించి సుఖ సౌభాగ్యాలను సమకూరుస్తున్నవను విషయం మరువరానిది.

## అభినందనీయము

మద్రాసు రాష్ట్రంలో ఎప్రాంతములోనైనా అధిక సంఖ్యాకులు మాట్లాడే భాష (తమిళమున)కు భిన్నమైన భాష మాట్లాడేవారు నూటికి 20 లేదా అంతకు మించి యున్నపుడు ప్రధానమైన ప్రకటనలను నిబంధనలను, ఓటరుల జాబితాలను అల్ప సంఖ్యాకుల భాషలోకూడ ప్రకటించునట్లు మద్రాసు ప్రభుత్వము వారు ఉత్తరువులు జారీచేశారు.

అల్ప సంఖ్యాకుల రక్షణకు సంబంధించిన దక్షిణమండల మంత్రుల సంఘము నిర్ణయము పురస్కరించుకొని ప్రభుత్వము ఉత్తర్వు చేసింది.

ఈ ప్రభుత్వ నిర్ణయము అల్పసంఖ్యాక భాషావర్గాలకు బహుళోపయోగమేకాక ప్రభుత్వముపట్ల సయితము సద్భావము, అభిమానము కలిగించును. తమ భాషా, సంస్కృతులకు రక్షణ కలిగినందుకు సంతోషింపగలరు. ఈ నిర్ణయం యితర రాష్ట్రాలకు సయితం ఆదర్శనీయమైన దనవచ్చును.

## ప్రాథమికోపాధ్యాయులకు పించను, భీమా, ప్రావిడెంటుఫండు వసతులు

ఆంధ్రలో ప్రాథమికోపాధ్యాయులకు పించను, భీమా, ప్రావిడెంటు ఫండు వసతుల పథకం యీ ఏప్రిల్ నెల నుండి అమలుచేస్తామని ఆంధ్ర విద్యామంత్రి రాష్ట్ర ప్రాథమికోపాధ్యాయ పరిషత్తులో వెల్లడించారు. ఇంకా ఉపాధ్యాయినులకు గ్రామాలలో నివాసగృహాలను తృతీయప్రణాళికా కాలంలో నిర్మించాలన్న సంకల్పము కూడ కలదని మంత్రి అన్నారు.

విద్యా విజ్ఞానముల వ్యాప్తికి ప్రాథమిక విద్య పునాదివంటిది. కాబట్టి ఉపాధ్యాయులు సయితము తమ బాధ్యతలను గుర్తించి తమ కమరిన సౌకర్యాలను వినియోగించుకుంటూ చిత్తశుద్ధితో బాలబాలికలకు ఉపయుక్తమైన విధంగా విద్య గరపాలి. మంత్రిగారు చెప్పినట్లు గ్రామాలలోని కక్షలలో చిక్కుకోకుండా సమితుల, పంచాయతీల అధ్యక్షులతో స్నేహంగా నుండాలి.

బాలబాలికలు మరింత ఉత్సాహంగా పాఠశాలకు వెళ్ళి విద్యా విజ్ఞానముల నార్జించుకొనుట కనువైన పథకాలను రూపొందించడానికి ప్రభుత్వముకు ఉపాధ్యాయుల అనుభవ ప్రజ్ఞా విశేషాలు తోడ్పడాలి.

ఈ నూతన పథకం ప్రాథమికోపాధ్యాయుల స్థితిగతులను మెరుగుపరచగలదని ఆశిస్తున్నాము.

---

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras. Editor : C. C. Punniah.
Proprietors : Kesari Kuteeram (Private) Ltd.

# మహిళల ఆరోగ్య రక్షణకు

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణి స్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తల తిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము, జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలె యుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

3 ఔన్సుల బుడ్డి రు. 1-25 న.పై.

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాల ప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుము నొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయే గాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

3 ఔ॥ రు. 3-10   6 ఔ॥ రు. 5-50

## క్షీరబలాతైలం

స్త్రీలకు ఋతు దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బల హీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

6 ఔ॥ల బుడ్డి రు. 3-0

## సౌభాగ్యశొంఠి

### బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమును ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగ నున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారుచేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

బుడ్డి రు. 2-0

## ప్రమేహాంతకం

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతి యందు యీ జబ్బు సర్వసాధారణముగ నుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీ వ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

బుడ్డి రు. 4-0

## కేసరి కుటీరం ప్రైవేటు లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు-14.

ఆంధ్ర ప్రదేశ్, మైసూరుకు ఏజంట్లు :

శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికిందరాబాదు, బెంగుళూరు

ఇంటింటా భార్యా భర్తల
మధ్య చెలరేగే కలహాలనూ
పెంపొందే అనురాగాల
చిత్రించే ఉత్తమ కథ!

ప్రసాద్ ఆర్టు పిక్చర్సు సమర్పించు

# భార్యా భర్తలు

నిర్మాత: ఎ.వి.సుబ్బారావు ♦ స్క్రీన్ ప్లే, దర్శకత్వం: కె.ప్రత్యగాత్మ











NVKR

నవయుగ రిలీజ్

Lodhra Press, Madras - 14.